Jan-1941-13-11

ఆంధ్ర కన్నడ దేశములలో అపూర్వ ప్రదర్శనములు

మిమ్మల్ని అన్నివిధాలా ఆనందింపజేసే మహోజ్జ్వల పౌరాణిక చిత్రము

# భూకైలాస్

(మండోదరీ పరిణయం) (తెలుగు)

వేనకువేలు ప్రేక్షకులు చూచి ఆనందించారు

బలిజేపల్లివారి
కవిత్వం.

సుందరరావు నడ్కర్ని గారి
దర్శకత్వం.

స్టూడియో :
ప్రగతీ పిక్చర్సు, మద్రాసు.

ఆరితేరిన
నటవర్గము.

మీరూ నేడే సకుటుంబముగా చూచి ఆనందించండి

3 వ వారము

28_12_40 మొదలు

బెజవాడ - లక్ష్మీటాకీస్

విశాఖపట్నం - పూర్ణాథియేటరు

శికింద్రాబాదు - ఇందర్ టాకీస్

బెంగుళూరు - సాగర్ టాకీస్

కర్నూలు - సాగర్ టాకీస్

2 వ వారము

20_12_40 మొదలు

మద్రాసులో ఒకేసారి

పార్కగన్ & క్రౌన్ టాకీస్‌లో

26_1_41 మొదలు

రాజమండ్రి - జయా టాకీస్‌లో

4_1_41 మొదలు

తెనాలి - శ్రీ వెంకటేశ్వర టాకీస్‌లో

5_1_41 మొదలు

కాకినాడ - క్రౌన్ టాకీస్‌లో

తదితర ముఖ్య కేంద్రాల్లో త్వరలోనే విడుదల

ఈ టాకీ గీతములు 'ఓడియన్ రికార్డు'లలో వినండి.

వివరములకు :—

ఫేమస్ టాకీ డిస్ట్రిబ్యూటర్సు,

మౌంట్ రోడ్ మద్రాసు

# విషయసూచిక



వర్ణచిత్రము: ధర్మపత్ని — శాంతకుమారి




జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా !
జయజయ లలనారత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

---

# స్వాగతము

రంగవల్లులతోడ సింగారమును దీర్చి
రంగు రంగుతో గృహాంగణము దిద్ది
పచ్చటాకులు నిండ తోరణాల్గట్టి
పసుపు కుంకాలతో గోమాత నర్చించి
క్రొత్త అల్లుళ్లు, సరిక్రొత్త ధాన్యాలు,
క్రొత్త దుస్తులు, చుట్టపక్కాలు నిండ
నెలపట్టి నేటికి నెల నిండెనమ్మ
ఎపుడెప్పుడాయని ఎదురెదురుజూచి

కాచుకొనియున్నాము నీ రాకకొరకు
స్వాగతంబిదె గొనుము సంక్రాంతి లక్ష్మి!

ప్రకృతి పోకడలో క్రొత్తెంతో యున్న
మా భావాల, చేతలలో క్రొత్త కరవాయె
పాశ్చాత్యదేశములో యుద్ధాగ్ని జ్వాలలు
స్వదేశమున శాంతి సమర సందేశాలు
ఈ ఆటు పోటులో చీకాకు చెలరేగ
చిత్తశాంతియె లేదు భద్రతయె లేదు,
నిత్యకళ్యాణము పచ్చతోరణము
సార్థకము నీయెడ సంక్రాంతి లక్ష్మి!

మా కాత్మరక్షగా మాయందు నీవుండి
పరమకళ్యాణి, పాలించు పౌష్యలక్ష్మి!

—ఏడిద కామేశ్వరరావు.

# మకర సంక్రాంతి

మకరసంక్రాంతి అనగా సూర్యభగవానుడు మకర లగ్నములో ప్రవేశించుట. ఉత్తరాయణ పుణ్యకాల ప్రారంభము. భారతీయులందరు దీనిని ముఖ్యమైన పండుగగా భావించి కోలాహలముతో కొనియాడుచుందురు. భారత హృదయము సౌందర్యమున కాటపట్టు. సౌందర్యమునందే ఉత్సాహానందములు వెల్లివిరియును. మానవ హృదయమున నిదురించు దివ్యశక్తులను రేగించునది ప్రకృతియనియు నాతని మహదాశయము లోకప్పాడు పక్షుల కిలకిలారావమందున, పిల్ల తెమ్మెరలందును, పండువెన్నెలందును లతావితానముల యందును, చిన్ని సెలయేళ్లయందును ప్రకాశించుననియు పరమగురువు. రవీంద్రుడు వచించియున్నాడు.

వసుమతినంతయు రమ్యతరప్రకృతి సౌభాగ్యముతో కన్నులపండువై యలంకరించువాడు జగత్సాక్షియగు సూర్యభగవానుడు.

ఈ సహస్రాంశుడే మన సంక్రాంతిపండుగకు నుపాస్యదేవత. ఉపాస్యదేవత గుణముల ననుసరించియే ఉపాసకుని పూజావిధానముండును. మహత్తర దివ్యతేజములో వెలుగొందు ఉత్తమ గ్రహమగు సూర్యుడు లోకబాంధవుడుగదా! మన సంధ్యావందనము లోని సావిత్రీ స్తోత్రము సూర్యపరమైనదే. 'ఆదిత్యహృదయ'మను మంత్రరాజ జపము చేతనే రామచంద్రుడును, భారత వీరలును తమతమ ఈప్సితార్థములబడసి సుఖము గాంచిరి.

రథసప్తమి, సంక్రాంతి మొదలగు పర్వదినములు సూర్యగమన సంబంధములైనవి గాన మహిమాన్వితములని గ్రహించియే మన పూర్వులు ఆయాకాలములందు సూర్య ప్రీతికరములగు వ్రతానుష్ఠానములను నిర్ణయించిరి.

సూర్యతేజోవబోధకములగు సంధ్యాకాలంబులు, స్నానపానాది విధుల ననుష్ఠించుటకును, సూర్య నమస్కారాదివ్యాయామ కర్మకలాపానుష్ఠానమునకును యోగ్యమైనది గనుకనే ప్రాతః సాయంకాలములందు శాస్త్రచోదిత కర్మలుద్దేశింపబడినవి. స్త్రీల సౌభాగ్యవర్ధకములని ఆదివార నోములుద్దేశింపబడినవి. ఛాందోగ్యోపనిషత్తునందు తృతీయ ఖండమున సూర్యకిరణ ధ్యానమునుగూర్చి విశేషముగా ప్రశంసింపబడియున్నది.

ఇప్పటి ఇంగ్లీషువైద్యులు సయితము సూర్యకిరణ ప్రసారముచే పలువిధములగు వ్యాధులు నిర్మూలింపబడుచున్నవని కనుగొనియున్నారు. యాజ్ఞవల్క్యుడు, వరాహమిహిరుడు సూర్యారాధనమును వివరించియున్నారు.

తంజావూరు, తక్షశిలానగరము, ముల్తానగరము మున్నగు స్థలములలో సూర్య దేవాలయములుకూడ యున్నవని తెలియుచున్నది.

సూర్యుడు కాలమానముల కాధారభూతుడు. భూమి, సూర్యాదిగ్రహ గోళములు అన్యోన్యాకర్షణగలిగి గ్రహమండలమున తిరుగుచున్నవి. భూమియు, నవగ్రహములును సూర్యునిచుట్టు తిరుగుచున్నవి. భూమి తనచుట్టు తాను తిరుగుటవలన దివారాత్రములును, సూర్యునిచుట్టు తిరుగుటవలన సంవత్సరములును గలుచుచున్నవి. ఇట్లు తిరుగుటవలన మార్చి 22 తేది ప్రాంతమున భూమధ్యరేఖయున్న భూభాగము సూర్యుని కెదురుగను, సమీపముగను యుండుట ఏర్పడును. భూ మధ్యరేఖ కుత్తరమున 23½ డిగ్రీల దూరములో కర్కాటక రాశి లేక రేఖయున్నది. (Tropic of Cancer) భూమధ్యరేఖకు దక్షిణమున 23½ డిగ్రీలదూరమున మకరరాశి. (Tropic of capricorn) సూర్యుడు దీని కెట్టెదురైనపుడే మకరసంక్రాంతి. ఇది మహా పర్వదినమని భావింపబడుచున్నది. ఈరోజున జ్యోతిర్మయుడగు సూర్యదేవు నుద్దేశించి వ్రతములు, ఉపాసనలు జరుపుదురు. పొంగళ్లుబెట్టుదురు భూ, గో, స్వర్ణ దానములు జేయుదురు. పలువురు కూష్మాండదాన మొనంగుదురు. ఈ దినమునజేయు దానములకు కోటి గుణితములగు పుణ్యఫలమని విశ్వాసము. క్రొత్తగా వివాహమైన బాలికలు బొమ్మలనోము నోచుకొందురు. పట్టణములకంటె పల్లెలలో నీ సంక్రాంతిపండుగ మహా వైభవముగను, కోలాహలముగను నుండును. దీనికి మరునాడు కనుముపండుగ–అనగా గోవులను పూజించు రోజు_మన ఆయురారోగ్య యశో బలవర్ధకమునకును, సస్యాది ఫల సమృద్ధికిని, జీవశక్తికిని సూర్యతేజస్సెంత అవసరమో గోమాతయు మనకంత యవసరమైయున్నది. గోక్షీరముకూడ ఆయురారోగ్య బలవర్ధకము. గోమూత్రము, గోమయము పరిశుభ్రకరము. గోగ్రాసప్రదానముచే స్వర్గలోక ప్రాప్తియని వ్యాసునివాక్యము.

శ్లో॥ గవాహ్నికం పరగవేదద్యాదపి తృణాదికం

అకృత్వా స్వయమాహారం స్వర్గలోకం సగచ్ఛతి॥

గోదేహంబున 33 కోట్ల దేవతలు వాసముచేయుచున్నారని పురాణప్రసిద్ధి. కావుననే సేవాగ్రామములో "ఖాదీసప్తాహ"మనుపేర గాంధి జయంతి జరిగినపుడు మహాత్ముడు గ్రామస్థులతో నిట్లు పల్కినాడు.—"మీరు గోమాతసేవ గ్రహించుట నాకు పరమానందము. గోసేవచే మనము గోమాత దివ్యాశీర్వాదమును పొందుదుము. గోవు నేత్రములలో పవిత్రప్రేమ, ఆశీర్వాదములు చిప్పిలుచుండును. బహుశః ఇది నా పూర్వసంస్కారమేమో? చిన్నతనమునుండి గోపూజ నాకు బోధించుటచే నది నా కాచారమైనది. మీరును పవిత్రప్రేమతో గోవు నారాధించిన గోనయనములందు దొలుకాడు ప్రేమరసమును గుర్తించగలరు."అని అంతేగాక 'గోవునుకాని గోసంతతినిగాని ముల్లుకర్రతో బాధించజాల'మని ఆ గ్రామస్థులచే ప్రతిజ్ఞ చేయించుకొనిరి. కావున గోప్రభావమెరింగియే మనపూర్వులు కనుమురోజున గోపూజ నిర్ణయించిరి. మనము దానిని తప్పక అంగీకరించి ఆచరింపదగియున్నది.




# 'సజీవమైన వాఙ్మయం కావాలి'

అనే శ్రీమతి 'రోహిణి'గారి
'బహుపరాక్' పలుకులకు
క్రొత్త ప్రతిధ్వనులు

'సజీవమైన వాఙ్మయ నిర్మాణం కావాలి' 'కవిత్వమున్నది కాని నిర్మాణం లేదు' అను శీర్షికలతో 'గృహలక్ష్మి దసరా సంచిక'లో శ్రీమతి 'రోహిణి' గారి వ్యాసములోని అంశములు మంచి సమయోచితముగా నున్నవి.

ఏ జాతియైనను యే యుగములోనైనను సజీవముగా నున్నదని తెల్పుటకు సాహిత్యము, చిత్రలేఖనము, శిల్పము మూలముననే స్థిరస్థాయియగుననుటకు సందేహము లేదు.

ఒకనాడు ఆంధ్రజాతి ఉచ్ఛస్థానమలంకరించినదని సగర్వముగా చెప్పుకొనుటకు అజంతాశిల్పములు, ఎల్లోరాయందలి చెక్కడములు, లేపాక్షి దేవాలయమందలి చిత్రలేఖనములు గాక వేరు ప్రబలనిదర్శనము లేమి కావలయును? అవియే లేకపోయిన ఆంధ్రజాతి కళాప్రాభవమును మనము, ఇతరజాతులు గుర్తెరుంగగలవా? ఆ యుగపునాటి తెలుగు వెలుగును వేనోళ్ల స్తుతించగలవా?—

అట్లే సాహిత్యము, వాఙ్మయ నిర్మాణముగూడ. ఈ జాతి సౌరభవములో సాహిత్యము ప్రధాన స్థానమలంకరింపగలదు. ఇది లేనినాడు శ్రీమతి 'రోహిణి' గారు చెప్పినటుల 'నిద్రాణమైన నిస్తేజమైన' యుగమువలె చరిత్రకారుడు నిర్వచింపగలడు.

నన్నెచోడుని ప్రథమ తెలుగురచననుబట్టిగదా నాటిరాజుల చరిత్ర, ప్రజల ఆచారవ్యవహారములు తేటతెల్లమగుచున్నవి. శబ్దశాసనుడగు నన్నయ లేనిచో రాజరాజనరేంద్రుని కాలపు ఆంధ్ర సంస్కృతి తెలియదుగదా? అట్లే శ్రీనాథ, పోతన కవిచంద్రులుగూడ. ఆంధ్రభోజుడు శ్రీకృష్ణ సార్వభౌముని కాలమున ఆంధ్రకవిత వన్నెచిన్నెలు దొడిగి, ఆదర్శప్రాయమై మనకు రచనాపుష్టి నిచ్చుచున్నది. ఇంతవరకు ఆ యీ యుగములలో ఆంధ్రజాతి ప్రతాపపటిమ, కళాకౌశలము మనకు లభ్యమగుచున్నవి.

కాని, తరువాత మనజాతి నిల్చియున్నదని చెప్పుటకు తగిన గ్రంథములుగాని మరి ఇతరముగాని మనకు లేవు. దీనికి కారణమేమి? పోషించు దాత లేకపోవుటయే—దీనికితోడు స్వాతంత్ర్యము లేకపోవుట—ఈ రెంటికి దోడు మనకు, ముఖ్యముగా ఆంధ్రజాతికి దాస్య మలవడివది. దీనితో జాతి అన్నిట బలహీనము జెందినది.

లేనిచో, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు తలపెట్టిన ఆంధ్రవిజ్ఞానసర్వస్వము అంతలోనే నిలిచిపోవునా? చెప్పవలెనన్న 'పుబ్బలో పుట్టి మఖలో మాడి'నవి ఎన్ని లేవు? ఇట్టివాటిని గుర్తించి, తప్పిదమును తెలిసికొని, ఆంధ్రమహాశయులు తమ్ము దాము ప్రశ్నించుకొనవలసిన సమయమిది.

నేటి వాఙ్మయ ప్రపంచమున ముఖ్యముగా భావకవిత్వము విచ్చలవిడిగా సంచరించుచున్నది. భావ ప్రాధాన్యమని చెప్పికొను యీ భావకవిత్వమందు భావము సూన్యమే గాక, అయోమయముగ గన్పట్టుచున్నది. కాని ఇందైనను 'నిర్మాణము' గాన్పించుటలేదు. చివరకు ఇది తెనాలి రామలింగని 'భావేగుబ్బము' మాదిరిగ సరివచ్చునేమో?

ఇక ప్రస్తుతకాలమున వ్యావహారిక రచన మిగుల వ్యాప్తమైయున్నది. ఇది నిజముగా ప్రబోధకతమై చక్కని విజ్ఞానసంపద కలుగజేయవలసియున్నది. కాని అదియును కాన్పించుటలేదు.

భావి చరిత్రకారుడు చెప్పికొనవలసిన విషయములలో వ్యవహారికభాషా రచనలకు చక్కని స్థానమీయగలడు. అందుకు ఈ భాషయందు సజీవమైన రచనలు ఉద్భవించవలసియున్నవి. దీనికి నేటి కవి మిత్రులు పూనుకొనవలయును.

'రోహిణి' గారి వ్యాసముపై విమర్శనను వ్రాసిన శ్రీమతి వట్టికొండ విశాలాక్షిగారు, నేటి కాలపు కవిపండితుల రచనలనుగురించి చెప్పక ముందుతరమువారికి విడిచి ఊరకున్నారు. కాని సుహృద్భావముతో నిర్మాణమునకు తగిన చర్చ ప్రమాదమనుకొనను. ఇందలి విషయమైకూడ చర్చ ముఖ్యముగా జరిగినగాని ఉత్కృష్ట రచనలు సృష్టింపబడవు.

ఆంధ్రభూమియందు శ్రీమంతులకు లోటులేదు. వీరందరును కవిపండితులను ప్రోత్సహించిన నిజముగా సుకవిత్వము ఆగిపోయి చక్కని రచనలు నిర్మాణము కాగలవు. రాజపోషణ కరవైన నేటికాలమున ప్రజలే పోషింపవలసియున్నది. అట్టిదానికి ఆంధ్ర సోదర సోదరీమణులు పూనుకొనవలసినదిగా ప్రార్థించుచున్నాను.

—వక్కలంక సుబ్బాయమ్మ.

# ఆంధ్రభూమి! నమామి

ఆంధ్రవీరుల ఆంధ్రతేజము,
ఆంధ్రకవితల నలరిదేలిన
ఆంధ్రభూమి నమామి ॥ఆం॥

రాజరాజ నరేంద్రులాదిగ
రాజరాజుల రాజతేజము
దీప్తివెలిగిన దివ్యభూమి
° ఆంధ్రభూమి నమామి॥

నన్నయాది మహాకవీంద్రుల
ఘంటకవనపు కావ్యకన్యలు
నాట్యమాడిన రంగభూమి,
ఆంధ్రభూమి నమామి॥

వీరబొబ్బిలి బాలచంద్రులు
వైరివీరుల వేడినెత్తుట
మునిగిపోయిన పుణ్యభూమి
ఆంధ్రభూమి నమామి॥

—ఆకుండి వెంకటేశ్వరరావు

# ★ నక్షత్ర ఫలితాలు

కవికలహంసి
శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

## ● పుష్యమాసము ●

### అశ్విని
విషభయం; పోట్లాట; పాపకార్యం.

### భరణి
స్వజనదూషణ; గృహములో కలహము; విపత్తు

### కృత్తిక
దుర్బలత్వం; రక్తవిరేచనం; మిత్ర సమాగమం.

### రోహిణి
తల్లికి సౌఖ్యం; ధాన్యవృద్ధి; పైత్యరోగం.

### మృగశిర
ఐశ్వర్యం; కులవృద్ధి; కీర్తి; సంగ్రామం

### ఆర్ద్ర
అజీర్ణం; వృత్తిహీనత; ద్వేషం.

### పునర్వసు
వ్యాపారవృద్ధి; సౌఖ్యం; సంతుష్టి.

### పుష్యమి
బంధుపీడ; ప్రభుదర్శనం; శుభము చేయుట.

### ఆశ్లేష
జ్వరం; దుర్వార్తాశ్రవణం; ధనప్రాప్తి.

### మఖ
క్లేశం; పురాణశ్రవణం; లాభం.

### పుబ్బ
గృహనిర్మాణం; వైరం; త్రిప్పటలు.

### ఉత్తర
విషజ్వరం; స్థానభ్రష్టం; సంచారముతోగూడిన ఉద్యోగం.

### హస్త
సద్గోష్ఠి; ధనలాభం; సుఖం; ధైర్యం.

### చిత్త
వేదాంతవిచారణ; భక్తి; పుత్రసంతోషం;

### స్వాతి
కుటుంబసౌఖ్యం; ధనాగమనం; ఆరోగ్యం.

### విశాఖ
సంపద; భోగభాగ్యం; విద్యాగోష్ఠి.

### అనూరాధ
ఉష్ణజ్వరం; ప్రయాణం; కష్టం.

### జ్యేష్ఠ
నష్టం; అధికారం; ప్రజాపాలనావృత్తి.

### మూల
దుర్జనసాంగత్యం; పాపకార్యములచే ధనప్రాప్తి.

### పూర్వాషాఢ
మనస్తాపం; గృహమందు కల్యాణం; సద్వ్యయం.

### ఉత్తరాషాఢ
క్లేశం; శస్త్రచికిత్స; ఇష్టకార్యసిద్ధి.

### శ్రవణం
జ్ఞాతివైరం; బంధుసౌఖ్యం; వాతరోగం.

### ధనిష్ఠ
సంసారసౌఖ్యం; ధనలాభం; రాజదర్శనం.

### శతభిషం
విదేశవాసం; ఆందోళన; చిక్కులు.

### పూర్వాభాద్ర
సుగంధాదిలేపనం; వస్త్రలాభం; సంగీతశ్రవణం.

### ఉత్తరాభాద్ర
శిరోవ్యాధి; అకాలభోజనం; చంచలము

### రేవతి
ప్రయాణమందు నష్టం; ధనహాని; కృషిహాని.

# ★ శ్రీ సాముద్రిక శాస్త్రము ★

కవికలహంసి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

( గతసంచిక తరువాయి )



నడిమివ్రేలు మొదటి కనుపునుండి రెండవ కనుపువరకూ ఒకసరళరేఖ సాగియుండిన కార్యసిద్ధిని, ఐశ్వర్యమును, మరణశాసన పూర్వకముగా లభించిన ఆస్తిని సూచించును.

ఆ సరళరేఖ మూడవ కనుపువరకు సాగియుండిన విద్వత్తు, గౌరవము, సంతుష్టి వీటిని సూచించును.

ఈ రేఖ వంకర తిరిగియుండిన యుద్ధములో మరణము.

ఈ వ్రేలి మూడవకనుపు నుండి మొదటి కనుపువరకు కొన్ని నిలువు రేఖలు సాగియుండిన ఖనిజ సంబంధమయిన వ్యాపారముండును.

దీని మూడవకనుపు లేక కన్యారాశియందు త్రికోణరేఖయుండిన అదృష్టహీనత, చెడు స్వభావము సూచించును; నిలువ గుర్తుయుండిన పుత్రహీనత; నక్షత్రగుర్తు యుండిన కీడును, అల్పాయుస్సును సూచించును.

మొదటి కనుపు లేక కటకరాశియందు నక్షత్రరేఖయుండిన మంచిదికాదు, ఆపదలు, దుఃఖము. దీనియందు నల్లనిమచ్చ యుండిన చలిజ్వరము; కష్టములు సంభవించును. దీని చివర నక్షత్ర గుఱుతుండిన ఏకార్యము ప్రారంభించినను విఘ్నములేక కొనసాగును.

ఇది మిగత రెండు కనుపులకంటె పొడవుగానుండిన, వారు సర్వదామృత్యువునే గోరుచుందురు.

రెండవకనుపు పొడవుగానుండిన వ్యవసాయమునందు అపార ప్రజ్ఞగలిగి; అనేక ఆయుధములను ఉపయోగించు వారైయుందురు.

మరియు నీ కనుపు బొద్దుగా, వెడల్పుగానుండిన గణితశాస్త్రమందు నేర్పును పురాణములందు అభిమానమును కలిగియుండును.

కన్యారాశి పొడవుగా నుండిన ఓర్వలేనితనము; దుశ్చింతనము.

## ఉంగరపు వ్రేలు—

ఈ వ్రేలున కధిపతి రవి గావున దీనికి రవి వ్రేలనియు పేరు. ఇది పాండిత్యమును ఐశ్వర్యమును సూచించును.

ఇది మొనదేలియుండిన పాండిత్యము, సహజ జ్ఞానమువలనవి షయములను తెలిసికొనెడి తెలివియు నుండును. ఇది శనివ్రేలి వైపునకు వ్రాలిన డంభము, ఆడంబరము, అతివ్యయము సూచించును. చిటికెనవ్రేలి వైపునకు వ్రాలిన ధనార్జనమే ప్రధానముగా జేసుకొని విద్యాశక్తులన్నిటియందును బుద్ధిని వినియోగించును.

(సశేషము)

# చెన్నపురి ఆంధ్రమహాసభ స్త్రీలశాఖాభివృద్ధి

## శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారి ప్రశంస

చెన్నపురి ఆంధ్రమహాసభ స్త్రీల శాఖవారి వారాంతోపన్యాస సందర్భమున శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారు ఇట్లు ఉపన్యసించారు.

"చెన్నపురి ఆంధ్రమహాసభ స్త్రీలశాఖ శ్రీమతి దుర్గాబాయమ్మగారి ఆధ్వర్యమున విజయవంతంగా వర్ధిల్లుచుండడం చూస్తే నాకు చాలా సంతోషంగా ఉంది. ఆమె మొదలుపెట్టిన ఏ కార్యముగాని నిర్విఘ్నముగా కొనసాగవలసిందే. ఆమె దేశభక్తపరాయణ. అనేక సంవత్సరాలుగ దేశానికేగాదు, సంఘానికి, స్త్రీవిద్యాభివృద్ధికి సేవచేస్తోంది. దీనికోసం ఆమె ఎంతో త్యాగంచేసింది. కాకినాడలో ఉన్నప్పుడు మా విద్యార్థినీ సంఘానికి చాలా విషయాల్లో సహాయంగా ఉండి స్త్రీలలో విద్య, చైతన్యం, ఉద్రేకం, ఉత్సాహం రేకెత్తింపజేసిందీమె—స్వాతంత్ర్య సమరమప్పుడు జెండా బట్టుకొని దుర్గాబాయి బయలుదేరిందంటే, రెండు వీధులు తిరిగేసరికి వందలతరబడి స్త్రీ జనమంతావచ్చి గుంపులుగూడేవారు. జనుల నాకర్షించేశక్తి ఆమె కంఠస్వరములోనే ఉంది. ఈ సందర్భంలో ఆమెయందు నాకుగల మక్కువ, ఆదరాతిశయాలను దెలుపడానికి నాకు సంతోషంగా ఉంది. ఈమె B. L. పరీక్షలో కృతార్థురాలై న్యాయమూర్తిస్థానాన్ని అలంకరించి తన ప్రతిభా ప్రాభవాన్ని చాటించాలెనని నా ఆశయం. ఇటువంటి దేశభక్తులు చిరకాలం జీవించాలని మనం ప్రార్థించాలి. ఈమెవద్దనుంచి మీరందరుశిక్షణ నేర్చుకోవాలి. ఆమెచేసే ప్రతిపనులలోను మీరందరు ఏకీభవించి ఆమెకు సహాయముచేసి కార్యసాధనచేయాలి. ఒక్కవ్యక్తి ఎంత ప్రతిభాశాలియైనను లాభంలేదు. సంఘబలముండాలి, అందుకోసమే స్త్రీసమాజములు, స్త్రీసంఘాలు నిర్మించి మెంబర్లనుచేర్చి పట్టుదలతోపనిచేసి ఔన్నత్యానికి తేవాలి. జొన్నపురి నారలుకొన్నిటినిచేర్చి పేనితేగాని గట్టియైనతాడు కాదు. ఎందుకుపనికిరాని కొబ్బరినార వందలసంఖ్యగాకలిపి పేనబడినప్పుడు పెద్దపెద్ద రథములను, ఓడలను, కూడ అవలీలగా లాగేంత మోకై పరిణమిస్తుంది. ఆలాగే సంఘాలుగాని సమాజాలు చక్కగా పనిచేయవలనంటే శ్రద్ధగా కృషిసలిపే మెంబర్లుకావాలి.

ఈ మెంబర్లందరుకలిసి వారానికొకరోజు సమావేశమై తమతమ అభిప్రాయాలను వెలిబుచ్చుకొంటూ సభయొక్క ఆశయాలను వృద్ధిజేసే సమాలోచనలుగావించి నిర్వహించాలి. ఒట్టొట్టి కబుర్లతో కాలముగడపక అనుకున్నంతవరకు కార్యరూపంలో బెట్టాలి—ఇప్పుడీ ఆంధ్రమహాసభ స్త్రీశాఖలో, సంగీతం, నృత్యం, హిందీ, బెనారస్ మెట్రిక్ కోర్సుమొదలగు శాఖలనుబెట్టి, విద్యార్థులను తయారుచేస్తూవుండడం చూస్తే నాకెంతో ఆనందమైంది. దీనితోబాటు మన మాతృభాషయైన తెలుగుకుకూడ ఒక తరగతి ఏర్పరచి మన స్త్రీలకు మాతృభాషయందు రుచికల్పిస్తే చాలా బాగుండునని నాకోరిక-మన మెన్నిభాషలు, ఎన్ని విద్యలునేర్చినను మాతృభాషను మరువకూడదు. ప్రతిస్త్రీకిని మన భారత, భాగవత, రామయణాదిగ్రంథములనుచదివి చక్కగా సారమెఱుంగునంతటి జ్ఞానమైనా లేకుంటే సిగ్గుగాదా! మొన్ననే శ్రీయుతులు రామలింగారెడ్డిగారు ఒకచోట మాట్లాడుతూ "భారతం చదువనిచదువు చదువేకాదు" అని చెప్పారు. కాబట్టి మాతృభాషను మరచిపోకూడదు.

ఇదిగాక కొన్ని చేతిపనులు—నూలువడుకుట, కాగితములుచేయుట, నవారునేత ఇల్లాంటివికూడ పెట్టించి కొంతమందిస్త్రీలను తయారుచేయించితే బాగుంటుందని నా ఉద్దేశం."

ఉపన్యాసానంతరం కార్యదర్శిని అభినందనములతో సభ ముగిసెను.

# ★ స్త్రీ సాముద్రిక శాస్త్రము ★

కనికలహంసి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

( గతసంచిక తరువాయి )



నడిమి వ్రేలు మొదటి కనుపునుండి రెండవ కనుపువరకూ ఒకసరళరేఖ సాగియుండిన కార్యసిద్ధిని, ఐశ్వర్యమును, మరణశాసన పూర్వకముగా లభించిన ఆస్తిని సూచించును.

ఆ సరళరేఖ మూడవ కనుపువరకు సాగియుండిన విద్వత్తు, గౌరవము, సంతుష్టి వీటిని సూచించును.

ఈ రేఖ వంకర తిరిగియుండిన యుద్ధములో మరణము.

ఈ వ్రేలి మూడవకనుపు నుండి మొదటి కనుపువరకు కొన్ని నిలువు రేఖలు సాగియుండిన ఖనిజ సంబంధమయిన వ్యాపారముండును.

దీని మూడవకనుపు లేక కన్యారాశియందు త్రికోణరేఖయుండిన అదృష్టహీనత, చెడు స్వభావము సూచించును; నిలువ గుర్తుయుండిన పుత్రహీనత; నక్షత్రగుర్తు యుండిన కీడును, అల్పాయుస్సును సూచించును.

మొదటి కనుపు లేక కటకరాశియందు నక్షత్రరేఖయుండిన మంచిదికాదు, ఆపదలు, దుఃఖము. దీనియందు నల్లనిమచ్చ యుండిన చలిజ్వరము; కష్టములు సంభవించును. దీని చివర నక్షత్ర గుఱుతుండిన ఏకార్యము ప్రారంభించినను విఘ్నములేక కొనసాగును.

ఇది మిగత రెండు కనుపులకంటె పొడవుగానుండిన, వారు సర్వదామృత్యువునే గోరుచుందురు.

రెండవకనుపు పొడవుగానుండిన వ్యవసాయమునందు అపార ప్రజ్ఞగలిగి; అనేక ఆయుధములను ఉపయోగించు వారైయుందురు.

మరియు నీ కనుపు బొద్దుగా, వెడల్పుగానుండిన గణితశాస్త్రమందు నేర్పును పురాణములందు అభిమానమును కలిగియుండును.

కన్యారాశి పొడవుగా నుండిన ఓర్వలేనితనము; దుశ్చింతనము.

## ఉంగరపు వ్రేలు—

ఈ వ్రేలున కధిపతి రవి గావున దీనికి రవి వ్రేలనియు పేరు. ఇది పాండిత్యమును ఐశ్వర్యమును సూచించును.

ఇది మొనదేలియుండిన పాండిత్యము, సహజ జ్ఞానమువలనవిషయములను తెలిసికొనెడి తెలివియు నుండును. ఇది శనివ్రేలి వైపునకు వ్రాలిన డంభము, ఆడంబరము, అతివ్యయము సూచించును. చిటికెనవ్రేలి వైపునకు వ్రాలిన ధనార్జనమే ప్రధానముగా జేసుకొని విద్యాశక్తులన్నిటియందును బుద్ధిని వినియోగించును.

(సశేషము)

# చెన్నపురి ఆంధ్రమహాసభ స్త్రీలశాఖాభివృద్ధి

## శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారి ప్రశంస

చెన్నపురి ఆంధ్రమహాసభ స్త్రీల శాఖవారి వారాంతోపన్యాస సందర్భమున శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారు ఇట్లు ఉపన్యసించారు.

"చెన్నపురి ఆంధ్రమహాసభ స్త్రీలశాఖ శ్రీమతి దుర్గాబాయమ్మగారి ఆధ్వర్యమున విజయవంతంగా వరిల్లుచుండడం చూస్తే నాకు చాలా సంతోషంగాఉంది. ఆమె మొదలుపెట్టిన ఏ కార్యముగాని నిర్విఘ్నముగా కొనసాగవలసిందే. ఆమె దేశభక్తపరాయణ. అనేక సంవత్సరాలుగ దేశానికేగాదు, సంఘానికి, స్త్రీవిద్యాభివృద్ధికి సేవచేస్తోంది. దీనికోసం ఆమె ఎంతో త్యాగంచేసింది. కాకినాడలో ఉన్నప్పుడు మా విద్యార్థినీ సంఘానికి చాలా విషయాల్లో సహాయంగా ఉండి స్త్రీలలోవిద్య, చైతన్యం, ఉద్రేకం, ఉత్సాహం రేకెత్తింపజేసిందిమె—స్వాతంత్ర్య సమరమప్పుడు జెండా బట్టుకొని దుర్గాబాయి బయలుదేరిందంటే, రెండు వీధులు తిరిగేసరికి వందలతరబడి స్త్రీ జనమంతావచ్చి గుంపులుగూడేవారు. జనుల నాకర్షించేశక్తి ఆమె కంఠస్వరములోనే ఉంది. ఈ సందర్భంలో ఆమెయందు నాకుగల మక్కువ, ఆదరాతిశయాలను దెలుపడానికి నాకు సంతోషంగా ఉంది. ఈమె B. L. పరీక్షలో కృతార్థురాలై న్యాయమూర్తిస్థానాన్ని అలంకరించి తన ప్రతిభా ప్రాభవాన్ని చాటించాలెనని నా ఆశయం. ఇటువంటి దేశభక్తులు చిరకాలం జీవించాలని మనం ప్రార్థించాలి. ఈమెవద్దనుంచి మీరందరుశిక్షణ నేర్చుకోవాలి. ఆమెచేసే ప్రతిపనులలోను మీరందరు ఏకీభవించి ఆమెకు సహాయముచేసి కార్యసాధనచేయాలి. ఒక్కవ్యక్తి ఎంత ప్రతిభాశాలియైనను లాభంలేదు. సంఘబలముండాలి, అందుకోసమే స్త్రీసమాజములు, స్త్రీసంఘాలు నిర్మించి మెంబర్లనుచేర్చి పట్టుదలతోపనిచేసి ఔన్నత్యానికి తేవాలి. జొన్నపురి నారలుకొన్నిటినిచేర్చి పేనితేగాని గట్టియైనతాడు కాదు. ఎందుకుపనికిరాని కొబ్బరినార వందలసంఖ్యగాకలిపి పేనబడినప్పుడు పెద్దపెద్ద రథములను, ఓడలను, కూడ అవలీలగా లాగేంత మోకై పరిణమిస్తుంది. అలాగే సంఘాలుగాని సమాజాలు చక్కగా పనిచేయవలనంటే శ్రద్ధగా కృషిసలిపే మెంబర్లుకావాలి.

ఈ మెంబర్లందరుకలిసి వారానికొకరోజు సమావేశమై తమతమ అభిప్రాయాలను వెలిబుచ్చుకొంటూ సభయొక్క ఆశయాలను వృద్ధిజేసే సమాలోచనలుగావించి నిర్వహించాలి. ఒట్టొట్టి కబుర్లతో కాలముగడపక అనుకున్నంతవరకు కార్యరూపంలో బెట్టాలి—ఇప్పుడీ ఆంధ్రమహాసభ స్త్రీశాఖలో, సంగీతం, నృత్యం, హిందీ, బెనారస్ మెట్రిక్ కోర్సు మొదలగు శాఖలనుబెట్టి, విద్యార్థులను తయారుచేస్తూవుండడం చూస్తే నాకెంతో ఆనందమైంది. దీనితోబాటు మన మాతృభాషయైన తెలుగుకుకూడ ఒక తరగతి ఏర్పరచి మన స్త్రీలకు మాతృభాషయందు రుచికల్పిస్తే చాలా బాగుండునని నాకోరిక-మన మెన్నిభాషలు, ఎన్ని విద్యలునేర్చినను మాతృభాషను మరువకూడదు. ప్రతిస్త్రీకిని మన భారత, భాగవత, రామయణాదిగ్రంథములనుచదివి చక్కగా సారమెఱుంగునంతటి జ్ఞానమైనాలేకుంటే సిగ్గుగాదా! మొన్ననే శ్రీయుతులు రామలింగారెడ్డిగారు ఒకచోట మాట్లాడుతూ "భారతం చదువనిచదువు చదువేకాదు" అని చెప్పారు. కాబట్టి మాతృభాషను మరచిపోకూడదు.

ఇదిగాక కొన్ని చేతిపనులు—నూలువడుకుట, కాగితములుచేయుట, నవారునేత ఇల్లాంటివికూడ పెట్టించి కొంతమందిస్త్రీలను తయారుచేయించితే బాగుంటుందని నా ఉద్దేశం."

ఉపన్యాసానంతరం కార్యదర్శిని అభినందనములతో సభ ముగిసెను.

# ★ రా జ మ కు టం

రచయిత :
శ్రీ గోవింద వల్లభ పంతు

అనువాదకర్త :
శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి

## ముందు కథ

చిత్తోడు మహారాణా విక్రమసింహుడు మధు పానమత్తుడై పరిపాలనను నిర్లక్ష్యించాడు. రాణాచే అవమానితురాలైన శీతలసేని, రాణాను తొలగించి తన కుమారుడైన వనవీరునికి రాజ్యపట్టాభిషేకం చేయాలని, కుటిల సర్దారు రణజిత్తు సహాయంతో మాయపన్ని రాణాపై కత్తి కట్టించింది.

చిత్తోడేశ్వరి ఆలయంలో పన్నా ప్రార్థన చేసుకుంటూ చందన్ ఉదయులతో మాట్లాడుతూవుండగా రాణా ప్రవేశించి తనకు సర్దార్లంతా విరోధులైనారని తెలియజేసి కిరీటం పన్నాకివబోతూవుండగా, వనవీరుడువచ్చి, సర్దార్ల సహాయంతో రాణాను బందీచేశాడు.

### పాత్రలు

1. వనవీరుడు ... శీతలసేని పుత్రుడు
2. శీతలసేని ... వనవీరుని తల్లి
3. రణజిత్తు ... ఒక లోభి సర్దారు
4. పన్నా ... ఉదయుని దాది
5. విక్రముడు ... మహారాణా
6. కర్మచందు ... ప్రధానమంత్రి
7. ఉదయసింహుడు... విక్రముని తమ్ముడు

ఇక చదవండి

## ప్రథమాంకము

### 1. దృశ్యము

(వనవీరుని భవనం:—వనవీరుడు రాజ మకుటము పుచ్చుకొని ప్రవేశిస్తాడు)

వనవీర్ :-అహా! రత్నఖచిత సువర్ణ రాజమకుటమా! ఎంత ప్రభలమైనది నీ ఆకర్షణ! నిన్ను స్పృశించినంతమాత్రాన నాలో ఎటువంటి పరివర్తన కలుగుతున్నదో చెప్పలేకపోతున్నాను. నీవు నాకు ప్రబోధించావు: ప్రపంచములో మైత్రి అనేదీ, మిత్రుడనేవాడూ పూజ్యమని. ఇంకా ఏమి ప్రబోధిస్తావో, అంతా ఆచరించటానికి సిద్ధంగా ఉన్నాను. (మకుటము తలమీద పెట్టుకుంటాడు) ఇప్పుడు రాజధానిలో ప్రతిమనుష్యుడూ నా నిశ్చయానికి తల వూపుతాడు; నా ఆజ్ఞకు వేచిఉంటాడు; నేను చాల ఉన్నత పదవికి ఎక్కివచ్చాను.

(శీతలసేని ప్రవేశిస్తుంది)

శీతలసేని :-ఇంకా మూడు మెట్లున్నె ఎక్కవలసినవి.

వనవీర్ :-ఏమిటమ్మా అవి ?

శీతలసేని :-సమయం వచ్చినప్పుడు వీనే తెలిసికో గలవు. నీ మిత్రులసంఖ్య తక్కువగా ఉంది. వనవీర్ ! నీ శత్రువుల సంఖ్యను తగ్గించేందుకు ఏమీ ఆలోచించలేదూ నీవు ?

వనవీర్ :-సర్దార్ల ప్రోత్సాహంచేత నేను బంధించిఉంచిన అతన్ని-ఇప్పుడు నీప్రోత్సాహంచేత - అదేనా నీవు చెప్పేది ?

శీతలసేని :-ఔనౌను, అతన్ని వధించు. పరమేశ్వరుడు వినా నిన్ను విచారణ చేయగలవాడు మరెవడూలేడు. ఆయనకు జవాబు నాకు జరిగిన అవమానమే చెబుతుంది. ఆ అగ్నిలో అనుక్షణమూ దగ్ధమౌతున్నాను. వనవీర్ ! నీకాబాధ అర్థంకాదు.

వనవీర్ :-విక్రముని హత్య ! అమ్మా ! అదినీవు నాకెన్నాళ్లనుంచో ఉద్బోధించుతున్నావు. మేమిద్దరమూ ఒక్కచోట పెరిగాం. అతనికికూడ నీవు ఉగ్గుపెట్టినదానవే కదమ్మా ! అతడు నాపెదతండ్రికొడుకు కాదూ ! అతని హత్య కాజాలదు-

శీతలసేని :-అయితే ప్రాణాలమీద ఆశ వదులుకో.

వనవీర్ :-నాకేభయములేదు. సర్దార్లు విక్రముని బంధించారు. ఇదిగో ! రాజమకుటము నావద్ద తాకట్టు ఉంది. ఎవరమ్మా, నాకు శత్రువులు ?

శీతలసేని :-ఇంకొకసారి నాచేతనే చెప్పించాలెనా ?

వనవీర్ :-(కొంచెము జ్ఞాపకం తెచ్చుకుని) నీవు నాకొకప్పుడు జన్మ ప్రసాదించావు- మరొకసారి విక్రముడు పంపిన హంతకుని బారినుండి రక్షించావు. అదీ జ్ఞాపకం వచ్చింది.

శీతలసేని :-అతడే తిరిగిఎప్పుడో-మనకు తెలియదుగాని-ఏసమయాన్నో నిన్ను వధించేప్రయత్నంచేస్తాడు తప్పక. ఈ విచారమే నన్ను ఆపాదమస్తమూ రక్కిపెడుతున్నది. కౌరవులు పాండవులకు సోదరులు కాదేమిటి ; న్యాయానికీ, బాంధవ్యానికీ సంబంధంలేదు. విక్రముని వధించు. వధించి, రక్తమారకుండా ఆ కటారుతోనే ఉదయ——

వనవీర్ :-[ అర్ధోక్తిలో ] ఊరుకో, ఊరుకో, అమ్మా ! ఇదా ఉపదేశం ! తల్లిలేని బాలుడు ఉదయుణ్ణి కొన్నాళ్ళవరకూ గుండెల్లో పెట్టుకొని పోషించావు నీవు. రాజనీతి వస్త్రాచ్ఛాదనములో విక్రముని దండించుతావు. కాని, అబోధబాలకుడు ఉదయుని అపరాధ మేమున్నది ?

శీతలసేని :-అదీ ఇప్పుడే ఆలోచిద్దాం. నీవు వినలేదూ; విక్రముడు సర్దార్లతో గుప్తసంధి చేసుకోబోతున్నాడు.

వనవీర్ :-[ చకితుడై ] గుప్తసంధి !

శీతలసేని :-ఔను ఆవిషయమంతా తెలుసుకురమ్మని రణజిత్తును పంపాను. మరి విక్రముడు కారాగారవిముక్తుడౌతాడనుకో; ఎలాగ ?

వనవీర్ :-విక్రముని విడిపించటానికి సర్దారులెవరు ? మహారాణాను నేను. కటారు ఇచ్చివెయ్యమ్మా !

శీతలసేని :-ఇదిగో [ కటారు ఇవ్వబోతుంది ]

వనవీర్ :-కొంచెమాగు. చూచివస్తాను బైట అంధకార మెంత ఉన్నదో, అందులో నేను దాగిపోగలనో లేదో.

[ వనవీర్ నిష్క్రమిస్తాడు. రెండో వైపునుంచి రణజిత్తు గాభరాగా ప్రవేశిస్తాడు. ]

శీతలసేని :- ఎందుకా గాభరా ? ఏమిటి సమాచారం ?

రణజిత్తు :- సర్దారు కర్మచందు చెబుతున్నాడుకదా; విక్రముడు గనక న్యాయపూర్వకంగా రాజ్యం చేస్తానని ప్రతిజ్ఞ చేసేట్టయితే, అతన్ని జైల్లోనుంచి విడిపించి, సింహాసనంమీద కూచోబెడతాట్ట మళ్ళీను.

శీతలసేని :- అయితే వెళ్లు, వెళ్లు, రణజిత్ ! నీ విప్పుడేపోయి విక్రముని విడుదలకాకుండా యథాశక్తిని అడ్డుపుల్లలు వెయ్యి. తెలిసిందా ? కర్మచందుకెట్టి యధికారమూ లేదు. మేవాడ్ మహారాణా మన వనవీర్.

రణజిత్ :- మరి మేవాడ్ ప్రధానమంత్రి ?

శీతలసేని :- నీవే ఔదువుగాని. కాని వనవీరుని మార్గం కంటకపూర్ణమై ఉన్నంతవరకూ కాలేవు. కాబట్టి విక్రముని విడుదల కానీయకు. వెళ్ళు, ఆలస్యంచేయకు.

రణజిత్ :- అలాగే. [ రణజిత్ నిష్క్రమిస్తాడు ]

[ తెరవేపు చూస్తూ మెల్లిమెల్లిగా వనవీరుడు ప్రవేశిస్తాడు ]

వనవీర్ :- అంధకారం ! అంతటా అంధకారమే. కర్మసాక్షి అపరాబ్ధిలో కుంగిపోయాడు. చంద్రుడు కృష్ణపక్షపు చాటున దాగాడు. మంచు బిందువులవంటి నక్షత్రాలన్నీ మేఘాల్లో కరగిపోయినై. గృహదీపికలుకూడ ఆరిపోయేవేళ. ఇట్టి తమోమయ శర్వరిని నీవు నాచేతిలో కటారుపెట్టి శత్రుగృహానికి దారిచూపుతున్నావా, అమ్మా ?

శీతలసేని :- బంధీకృతమై ఉన్న సింహాన్ని బోనులోనే వధించి రా.

వనవీర్ :- ఇటువంటి భీషణవధ, అనంతమైన అత్యాచారం, విరామములేని హాహాకారం—వీటిమీదనే ఆధారంగా నిల్చిఉంది రాజసింహాసనం. నేనుదాన్ని అధిష్టించగోరుతున్నాను. అమ్మా ! ఏదీ కటారు !

[ కటారు తీసుకుని మోకరిల్లి ]

ఆశీర్వదించు. ఇదిప్రపంచంలో అన్నిటినీ మించిన పాపకార్యమే కావచ్చు. అయినా అందులోనే ఒకపుణ్యం వుంది. ఆ పుణ్యం మాతృవాక్యపాలన—

శీతలసేని :- [ ఆశీర్వదించి ] శత్రువధ నిర్వర్తించి నిర్భయుడివౌతావు.

[ చెరొక ప్రక్కనుంచి నిష్క్రమిస్తారు ]

తెర మారుతుంది.

## ౫. దృశ్యము

(చీకటి జైలు. శృంఖలాబద్ధుడై విక్రముడు.)

విక్రముడు :- నేను విక్రముణ్ణి, ప్రహరీ ! వింటున్నావా ? నిన్నటివరకూ నీవు నాముందు చేతులు కట్టుకుని నిల్చున్నావు. ఇప్పుడు కరవాలము పట్టుకుని నిల్చున్నావు !—నేను దుర్వ్యసనాలకు క్రీతదాసుణ్ణి అయిపోయాను. అయితే ఎందుకీ సమస్త - చిత్తోడు రాజ్యానికీ ప్రభువునైనాను ?—ప్రహరీ ! వింటున్నావా ? నీవు వెళ్లి ఒకపాత్ర మద్యము నింపి పట్టుకురా. అందులో ఇంత కాలసర్పవిషం

కూడా కలుపు. ఎందుకంటే అదే నా అంతిమ పానీయం. నా జీవితమంతా యీ మద్యముతో పోరాటము సాగిస్తూవచ్చాను. ఈరాత్రి నాశత్రువు న న్నంతము చేయునుగాక! నేను నవ్వుతూ నవ్వుతూనే విషపానము చేస్తాను. ఏం, దానివల్ల వీరస్వర్గం ప్రాప్తించదూ——?

రాజవంశమా! నీకు భోగలాలసత తగదు. నేనొక బిచ్చగత్తె కడుపున పుడతాను.

[భోజనసామాగ్రి ఉన్న పళ్లెం ఒకటి, కొన్ని దుస్తులు తీసుకుని పన్నా ప్రవేశిస్తుంది.]

ఎవరు?

పన్నా:-మహారాణా! నేనే, దాదిని, పన్నాను.

విక్రముడు:-దేనికి? ఎందుకోసం వచ్చావు?

పన్నా:-తిన్న ఉప్పును బదులు తీర్చుకోడానికి.

విక్రముడు:-ఏ విధంగా?

పన్నా:-(పళ్లెము నేలమీదఉంచి) భోజనం చేయండి. ఈ పళ్లెము పుచ్చుకుని ఈ కారాగారమునుంచి విముక్తి పొందండి. ఈ ఉంగరం ద్వారపాలకుడికి చూపించి, కోటవిడిచి వెళ్లండి.

విక్రముడు:-(ఉంగరము తీసుకునేందుకు చెయి చాపుతూ) మరి నీవు?

పన్నా:-నే నిక్కడే ఉంటాను. (విక్రముడు చెయి వెనక్కు తీసుకుంటాడు)

విక్రముడు:-దాదమ్మా! వనవీరుడు నిన్ను చంపివేస్తాడు.

పన్నా:-ఆ సంగతి నాకు బాగా తెలుసును. మహారాణా! రాజపుత్రస్త్రీ చావుకు వెరవదు.

విక్రముడు:-అయితే ఉదయుడు, చందన్——ఆ పసివాళ్లను ఎవరు పోషిస్తారు? ఈ విధంగా విముక్తుణ్ణయి, నేను మాత్రం ఎక్కడికి పోయేది?

పన్నా:-ఉదయుణ్ణి, చందన్‌నూ తీసుకుని ఈ మేవాడ్ విడిచి ఎక్కడికేనా సరే వెళ్లిపోండి. నిరాపదులై ఉండగలరు. సంగ్రామసింహుని నామమహత్యమే సైనికులందర్నీ కూడ దీస్తుంది. మీ రక్తనాళాల్లోనూ ఆ వీరకేసరి తేజమే ప్రజ్వలిస్తూవుంది. ఆసంగతి మీ రిన్నాళ్లూ మరచిపోయారు, అంతే. ఏనాడు మీ రది స్ఫురణకు తెచ్చుకుంటారో, ఆనాడు-ఒక్కడు కాదు, శతసహస్ర వనవీరులుకూడా మిమ్మె దుర్కోలేరు. తీసుకోండి ఉంగరం; త్వరగా భోజనంచేసి విముక్తి పొందండి.

విక్రముడు:-వద్దమ్మా! అలా కాదు. నే ననేక అపరాధాలుచేశాను; అందుకు శిక్ష అనుభవించవలసి ఉంటుం దనే ఆలోచన నాకే క్షణానా నట్టలేదు. ఈ చీకటింటనే నన్ను బంధింపబడి ఉండనీ; ఇదే నాకు శాంతిమయంగా కనబడుతోంది. పన్నా! నే నిప్పుడు ఖైదీనే; అయితే ఏమి! నార క్తనాళాల్లో వీర శిరోమణి సంగ్రామసింహుని రక్తమే ప్రవహిలుతోంది. నేను పురుషుణ్ణి; స్త్రీ వేషమువేసి నన్ను జైలు విడిపింపచూస్తున్నావు. వద్దమ్మా! అట్టి వేషముతో నేను స్వర్గానికేనా పోనొల్లను.

(చేత దీపము పట్టుకొని ఉదయుడూ, కర్మచందు ప్రవేశిస్తారు)

ఉదయుడు:-(దీపము ఒకపక్కన ఉంచి) అన్నా! ఇదిగో పితృతుల్యులైన సర్దారు కర్మచందుగారి సమక్షములో ప్రతిజ్ఞ చెయ్యండి. మీ రాయన ఉపదేశాన్ని మన్నించవలసిన సమయం వచ్చింది. వీరు మీకు బంధమోచన మిప్పించడానికే వచ్చారు. మీ రికనుంచి సన్మార్గవర్తు లౌతారుగాక!



శ్రీమతి రామేశ్వరీ నెహ్రూ

గత మాసములో బెంగుళూరునందు జరిగిన

15 వ అఖిలభారత మహిళామహాసభకు

అధ్యక్షత వహించారు.



ఆంధ్రరాష్ట్ర మహిళామహాసభ - నంద్యాల

గతమాసమందు జరిగిన 15 వ ఆంధ్రరాష్ట్ర మహిళామహాసభ అధ్యక్షురాలగు శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మ బి. ఏ. గారును (మైసూరు) ప్రారంభకురాలగు శ్రీమతి కే. రామసుబ్బమ్మ గారును (కడప) పతాకోత్సవమును జరపిన శ్రీమతి చుండూరు రత్నమ్మ గారును (ఏలూరు) స్వదేశీ వస్తు ప్రదర్శనమును తెరచిన శ్రీమతి బత్తుల కామాక్షమ్మ గారును (రాజమండ్రి) మధ్య కూర్చొనియున్నారు.

విక్రముడు:-(కర్మచందు వేపుతిరిగి) దురభిమానమత్తుడనై నేను మీ మీద ఆనాడు నిండుసభలో కత్తిఎత్తాను. క్షమించండి. ఏకలింగస్వామి సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. ఇకనుంచి ప్రజల్ని సంతానోపేతుగా పాలిస్తాను.

కర్మచందు:-రవికుల భూషణులైన మీకామాటలు ఉచితముగా ఉన్నై. తిరిగి మీరు మహారాణా ఔతారు.

పన్నా:-విక్రమసింహ మహారాణాకు జయము!

కర్మచందు:-ప్రహరీ! మహారాణాను బంధనవిముక్తుణ్ణి చెయ్యి. (ప్రహరీవచ్చి విక్రముని శృంఖలాల్ని తీయ బోతూండగా రణజిత్తు ప్రవేశిస్తాడు.)

రణజిత్తు:-ప్రహరీ! జాగ్రత! ఎవరి ఆజ్ఞానుసారం చేస్తున్నావాపని? (ద్వారపాలకుని చేయిపట్టి వెనక్కులాగి నిలువబెడతాడు) మంత్రి మహోదయులు మీరు! సమస్త సర్దార్ల నిమంత్రణచేత ఖైదీచేయబడ్డ ఈయన్ను, కేవలం తమ ఒక్కరి ఇచ్ఛాను సారం-తమ ఒక్కరి ఆజ్ఞాప్రకారం-ఇప్పుడు విముక్తుణ్ణి చేయడం ఉచితంకాదు. తమరు మా కందరికీ పూజ్యులే; మా కందరికంటే ఎక్కువ రాజ్యానుభవం కల వారే. వనవీరుడు మహారాణా అయినాడు; ఇంత శీఘ్రంగా ఆయన హృదయానికి ఆఘాతం తగల కూడదు. కలహము కాకుండునుగాక! చిత్తోడులో శాంతి నెలకొనుగాక!

కర్మచందు:-అట్లేకానీ; మహారాణా! చింతించకండి. ఇదే తమ ప్రాయశ్చిత్తానికి అంతిమరాత్రి. రేపటి ప్రభాత సమయానికే విడుదల పొందగలరు.

ఉదయుడు:-అయితే, మహారాణాను ఇప్పుడే విడిచి పెట్టరూ!

కర్మచందు:-అధైర్యపడకు, నాయనా! నీవింకా కుర్రవాడివి; ఈ విషయాలన్నీ తెలుసుకోలేవు. ఒక్కరాత్రి మాత్రమే; యుగాలు కాదుకదా!

పన్నా:-మీ రింతవరకు ఏమీ భుజించలేదు, ఎంగిలి పడండి కొంచెం.

విక్రముడు:-వద్దమ్మా! నాకేమీ తినాలనిలేదు. అది అక్కడే ఉంచి వెళ్లు; కోరిక పుట్టినప్పుడు తింటాను. మీరందరూ వెళ్లండిక. చాల పొద్దుపోయింది.

కర్మచందు:- పద, పన్నా!

పన్నా:-పదండి.

ఉదయుడు:-ఈ దీపం ఇక్కడేవుంచి వెళ్లుదాం.

(విక్రముడు తప్ప అంతా నిష్క్రమిస్తారు)

విక్రముడు:-[దీపాన్ని ఉద్దేశించి] సూర్యబింబములేని వేళల నీవే చీకటిత్రోవల్లో వెల్తురు చిమ్ముతావు; దీపమా, నీకు నమస్కారము. ఈ కారాగారాన్ని నా పూర్వులు నిర్మించారు. ఇందులో వారెన్నడూ దీపం వెలిగించలేదు; నేనూ వెలిగించలేదు. నాకోసంగా ఇప్పుడీ దీపం ఎందుకు వెలగాలి? బహుశః ఈ అంధకారంలోనే నా పాపాలు భస్మీపటల మౌతాయేమో! [దీపం ఆర్పి] బహుశః ఈ చీకటిలోనే నాకొకమార్గం కనబడుతుందేమో! నిశ్శబ్దంగా ఉంటాను.

[అతి జాగ్రతగా వనవీరుడు కటారు పట్టుకొని, నాలుగు వైపులా చూచుకుంటూ ప్రవేశిస్తాడు]

వనవీర్:-[తనలో] ఈ అంధకారంలో పాపమంతా మూర్తీభవించి ఉంది. అది రూపుమాసి పోవుగాక! దాని ఊపిరి చప్పుడుకూడా వినిపించడంలేదు.

విక్రముడు:-ఎవరివో అడుగుల చప్పుడు! ఈ అంధకారంలో స్పష్టంగా కనిపించడంలేదు, ఎవరు నువ్వు?

వనవీర్:-అడగవద్దా ప్రశ్న.

విక్రముడు:-గుర్తు పట్టాను నీ కంఠస్వరం. మిత్రుడు వనవీరుడివి.

వనవీర్:-నీ చెప్పుడూ నా మిత్రత్వం కోరుతున్నావు. నన్ను మించిన శత్రువు నీకు లేడు. విక్రమ్! నీకు తెలియలేదేమో ఇవాళ నా కటారు నీ రక్తాన్ని కోరుతోంది.

విక్రముడు:-అందుకు నేనేమీ భయపడను. నా చేతులూ, కాళ్లూ బంధింపబడి ఉన్నై; అతి సుగమంగా నీవు నన్ను వధించగలవు. కాని, కొంచెమాగు; నా అపరాధ మేమిటో తెలుసుకోనీ.

వనవీర్:-అది సరిగ్గా నాకూ తెలియదు. తెలిసిన కొంచెమూ ఇప్పుడు చెప్పటానికి సమయంకాదు.

విక్రముడు:-ఇంకొక్కమాట.

వనవీర్:-చెప్పు.

విక్రముడు:-ఈకట్లు విప్పి నన్ను విడిచిపెట్టు, వనవీర్! రాజమకుటము నీవే ఉంచుకో. నేను నీ రాజ్యపు పొలిమేరదాటి వెళ్లిపోతాను. సన్యాసినై తీర్థయాత్రలు చేసుకుంటాను.

వనవీర్:-మాట్లాడకు, విక్రమ్. నేనేమీ వినను. నీ మాటలవల్ల నాకు మోహ ముత్పన్నమౌతోంది.

విక్రముడు:-వనవీర్! వనవీర్!

వనవీర్:-ఊహుం ముగిసింది...

(విక్రముని ఛాతిలో కటారు గుచ్చుతాడు)

విక్రముడు:-(భూపతితుడౌతూ) హా, భగవంతు—

వనవీర్:-(విక్రముని గుండెపై చేయి ఉంచి)
విక్రమ్! మహారాణా విక్రమ్!

(వనవీరుడు విక్రముని నాసికముందు వ్రేళ్లుంచి, మృతుడైనట్లు నిశ్చయించుకొని, ఛాతిలోనుంచి కటారు పెరికికొని, జాగరూకుడై పారిపోతాడు.

తెరపడుతుంది.

## ౬. దృశ్యము

(చీకటితోవ; తుపాను, మెరుపు)—(ఒంటరిగా రణజిత్తు ప్రవేశిస్తాడు)

రణజిత్:-తప్పకుండా రాజ మంత్రినౌతాను. కాని శీతలసేని మనస్సు మారిపోతే ఒకవేళ?......అయితే మాత్రం భయమేమిటి? (లోపలి జేబులోనుంచి శీతలసేని రాసియిచ్చినపత్రాన్ని బయటికితీసి) ఇది ఆవిడ దస్తూరికాదూ! ఆమె సృష్టించిన ఈ సమస్త కపటప్రపంచాన్నీ ప్రకటంచేసే శక్తి దీనికి

లేదూ? ఆహా! ఏమి, ఆ అక్షరాల నీలినిగనిగ! ఇందలి శబ్దాలమధుర - అర్థ-చ్ఛాయవలే ఉంది! దీనిమీద నా ప్రధానమంత్రి ఆసనం సుస్థిరంకావాలి.

(తెర ఆవల శీతలసేనినిచూచి పత్రాన్ని జేబులో పెట్టుకుంటాడు)

ఎవరు? ఆవిడే!

(మెరుపు మెరుస్తుంది; శీతలసేని ప్రవేశిస్తుంది.)

శీతలసేని :_నీ విక్కడే ఉన్నావా?

రణజిత్ :_ఇక్కణ్ణించి కదలిపొమ్మని రాజమాత నన్నెప్పుడాజ్ఞాపించారూ?

శీతలసేని :_రణజిత్! ఇంతసేపయింది; ఇంకా వనవీరుడు రానేలేదు. విక్రముని చూడగానే అతని నిశ్చయం మారిపోలేదుకద!

రణజిత్ :_అలా జరగదు. ఈ క్రోధవనే మహారాణావెళ్ళారు, చూచానుగా! ఆయన శరీరంలోనుంచి నిప్పు రవ్వలు బయటికి చిమ్ముతున్నై; అప్పటి ఆయననడకచూస్తే తప్పకుండా శత్రువధచేసే వస్తారని నాకు నమ్మకంకలిగింది.

(వనవీరుడు ప్రవేశిస్తాడు.)

వనవీర్ :-ఎవరూ? అమ్మా! నీవు ఇక్కడ.

శీతలసేని :-ఔను, నీకు సహాయంగా—ఏమిటి సమాచారం?

వనవీర్ :-నీ అవమానాగ్ని, నా కటారు దాహం-రెండూ ఒకేసారి చల్లారినై.

శీతలసేని :-విక్రముని హత్య?

వనవీర్ :-ఔను, ముగిసింది; ఇదిగో అతనిరక్తంతోతడిసి ఉన్న ఈకటారు నీ పాదాలకు కానుక.

(కటారు శీతలసేని పాదాలముందు ఉంచుతాడు.)

శీతలసేని :-చిరంజీవ! వనవీర్! విక్రముడు మరణించాడుకదూ!

వనవీర్ :-ఆ. నేనతనిగుండెల్లో కటారుగుచ్చిన తక్షణమే భూపతితుడైనాడు. ఉచ్ఛ్వాసములులేని అతని నాసికముందు పరిశీలనకోసం వేళ్లుంచి పిల్చాను. "విక్రమ్! మహారాణా విక్రమ్"అని. నిన్ను 'దాసీ' అన్నవాడు_నా ప్రాణాలమీద దాహంగొన్నవాడు-అతని అధరోష్టాలు శాశ్వతంగా మూసుకు పోయినై.

శీతలసేని :-నాయనా! నీవు మాతృఋణవిముక్తుడివైనావు. కాని ఉదయుడు జీవించి ఉన్నంతవరకూ, విక్రముని రూపుమాపిన సంతృప్తిపొందలేవు. ఇతని రక్తంలోతడిసిన నీ చేతుల్ని అతనిరక్తంలో క్షాళనచేసుకో, ఆ తరువాత ఇంకొక్కటే రక్తపాతం. అదికూడాముగిస్తే, సింహాసనంమీద వనవీరుడు! చిత్తోడు రాజ్యంలోశాంతి!! శీఘ్రంగాకానీ; ఈ రాత్రి ఎంతో సుఖకరమైనది. రేపటి సూర్య బింబమూ, నీ సౌభాగ్యమూ - రెండూ ఒకేసారి ఉదయించునుగాక!

వనవీర్ :_చక్కగా చెప్పావు. వాడు పెద్దవాడై విక్రమునిహత్య మరచిపోడు. చేరువైంది, వాడి అంత్యమూ చేరువైంది.

[శీతలసేని నేలమీది కటారుయెత్తి వనవీరునికిస్తుంది.
మళ్లీ మెరుపు మెరుస్తుంది; ఉరుముతుంది]

శీతలసేని :_తీసుకో. వెళ్లు. ఉదయుడీ మహలులోనే నిద్రపోతున్నాడు.

వనవీర్ :_ఔను, ఎరుగుదును. [వనవీరుడు నిష్క్రమిస్తాడు]

శీతలసేని :_వనవీరుడిలో ఒకరకమైన దుర్బలత్వం ఉంది; ఒకవేళ సుందరవాడైన ఉదయుణ్ణిచూచి, గుండె కరిగి, కటారు విసరిపారేస్తే?

రణజిత్ :_ఆజ్ఞాపించుదేవీ! ఓ ప్రధాన మంత్రిత్వమా! నీకోసమని రాజమాతా! చెప్పండి, భూకంపంలో చొరబడేదా? ప్రళయంలో నాట్యంచేసేదా?

శీతలసేని :_వెళ్లు వనవీరుణ్ణి అనుసరించి. అతడు ఉదయుని వధించలేకపోతే నీవే ఆపని నెరవేర్చాలి.

రణజిత్ :_అలాగే.

శీతలసేని :_తెలుసునా? ఉదయుని అస్తిత్వము నీ మంత్రిపదవీ ప్రాప్తికికూడా అంత భయంకర-ఆటంకమే.

రణజిత్ :_ఔను, ఎరుగుదును. నేనతన్ని చంపగలిగితే—అతగాడి రక్తబిందువులన్నీ మీరిచ్చిన లిఖితపత్రానికి లక్షముద్రలౌతవి. (కత్తిదూసి రణజిత్ నిష్క్రమిస్తాడు)

శీతలసేని :_వెళ్లు. ఒకవేళ నీవైనా ఆ కుఱ్ఱవాణ్ణి వధించలేకపోతే? నేనూ వస్తున్నాను; నేనతన్ని వధించగలను.

(ఒరనుండి కత్తిపెరికి శీతలసేనికూడా అటువేపే వెళ్లుతుంది)

తెర మారుతుంది.

(ఇంకా వుంది)

# మలేరియా జ్వరపీడితులకు ముక్తి

## జ్వరాంతర కష్టములు ఆపబడినవి.

మన దేశములో ప్రతి ఆరింటిలో నొకరు మలేరియా జ్వరముచే మృతినొందుచున్నారు. దీనిని నిలుపుటకు డాక్టర్లు ఎక్కువశ్రమను తీసుకొనుచున్నారు.

జ్వరముచే క్షీణించిన దేహమునకు తిరిగి శక్తినిచేకూర్చవలెనని వారికితెలుసును. అయితే జ్వరము జీర్ణశక్తిని తగ్గించుటచే ఏ ఘనాహారమును సహించదు.

తేలికదైనది, త్వరలో జీర్ణమగునదియునైన ఒక ఆహారపదార్థమును డాక్టర్లు కనిపెట్టి ఎందరో రోగులకిచ్చి పరీక్షించిరి. మంచి ఫలమొసగినది. ఇదియే హార్లిక్సు. దీని సేవనచే నర, స్నాయు, రక్తమునకు పుష్టిలభించును. సర్వాంగములకు చైతన్యము చేకూరును. త్వరలో రోగనివారణ మగును. ప్రతి ఆస్పత్రులలోను రోగులకు హార్లిక్సునే యిచ్చుచున్నారు. రోగములనుండి నివృత్తులైన ప్రజలెందరో ఈ అద్భుత ఆహారమే తమ జీవితమునకు కారణమని కొనియాడుచున్నారు.

H. 469 B.

# ★ పాండవు లెవరు…? ★

హిమాలయమున కావలనున్న

యొక కొండజాతివారా...?

●

శ్రీమతి అకపా సుగుణమణి

●

పాండవుల ప్రవర్తనలయందు కొన్ని అమానుష క్రియలు ప్రచురముగ నున్నవి. ఇవి పవిత్ర హిందూమతమునకే కాక, ఆదర్శులైన భారత వీర వీరాంగనలకు గూడ దోషమాపాదించుచున్నవి—

అట్లగుట వీరు హైందవేతరులా?

కాక సమర్థనీయ మెట్లు?

"భారతము బొంకు రామాయణము రంక"ను సామెత మన హిందూదేశమున నాబాలగోపాలము మాటవరుసలలో సర్వసాధారణముగా దొర్లించుచుండుట గని, విని యున్నారము. ఈ ప్రయోగ మెవరు కూర్చినది, యెప్పుడాచరణలోకి వచ్చినది గ్రాహ్యముకాదు. కాని దీని వాడుక చిరకాలమునుండి యున్నదనుట నిర్వివాదాంశము. రామాయణ భారతములు తెనిగింపబడ్డనాటినుండియు వ్యవహరింప బడుచున్నదన నతిశయోక్తికాదని తలంచవచ్చును. 'ఈ ప్రయోగము వినినవారికి 'రంకు రామాయణముననేగాని భారతమున లేదా'యను సంశయము తోపవచ్చును. లేకేమి? సామెతకై యట్లు కూర్చి యుందురు లేదా కథావస్తువే బొంకని విశ్వసించిన పిదప 'బొంకుకు రంకును సహితమేల నాచ్ఛాదింపవలె'నని విడచియుందురు. ఏది యెట్లున్నను పంచమవేదమగు భారతము బొంకని నాడు, నేడు విశ్వసింపవలసిన విషయములు గోచరించుచున్నవి. అందు పాండవుల పుట్టుపూర్వోత్తరముల విషయము ప్రధానము. పాండవులు హిందూదేశీయులా? లేక వలస వచ్చిన తదితరదేశీయులా? యన్నప్రశ్న యొక క్లిష్ట సమస్య.

హిందూ సాంప్రదాయమునకు కొన్ని విరుద్ధములైన యాచరణలు పాండవులలో కాన్పించినవి. వీటిని కొంతవరకు మనము విమర్శింపగలిగిన నీక్లిష్ట సమస్యాపూరణము చాలవరకు సానుకూలము కాగలదు. అందు మొదటిది ద్రౌపది కల్యాణము. హిందూ సాంప్రదాయానుసారముగ పురుషుడు పెక్కు స్త్రీలను చేబట్టుట కర్హతగలదు గాని స్త్రీ యొకనికన్న నధికముగ నుద్వాహమాడరాదు. ఈ ఘట్టమున గ్రంథకర్త వేదవ్యాసుడు విమర్శనమున కవకాశమీయకుండుటకై కట్టుకథల కల్పించి సమస్య నధికముగ జిగిబిగి చేసినాడు. కాని యీ పరిణయము పాండవుల సమకాలికులకు సహితము వింతగా కాన్పించినది. విడ్డూరముగ తోచినది. ఉదాహరణమునకు యుధిష్ఠిరుడు "ఈ పెండ్లి ద్విజాల ధర్మమునకు వ్యతిరిక్త"మని నుడివెను. ద్రుపదుడు "పురుషుడు పెక్కు స్త్రీలను వివాహమాడుట కద్దుగాని స్త్రీ పెక్కురను వివాహమాడుట కని వినియుండలేదు. ఇది నీతి విరుద్ధ"మని వాక్రుచ్చెను. కర్ణుడు "భగవంతుడు స్త్రీకి యొక భర్తనే విధించెను. ఈమె పెక్కురు భర్తలను చేబట్టినది. కాన నీమె గృహిణికాదు. వెలకాంత. ఈమె నేకవస్త్రముగ నున్నప్పుడేకాదు, వివస్త్రగనున్నప్పుడుకూడ సభకు తేవచ్చు"నని పలికెను. పోనిందు, వ్యాస భట్టారకుడు

చెప్పిన విధమున మాతృయాజ్ఞకు కట్టువడి పంచపాండవులు కృష్ణను పెండ్లాడు నవస్థ తటస్థించె ననుకొందమన్నను సందేహము వీడదు. ధర్మజుడు "ఈ సౌందర్యరాశి సోయగమునకు నా తమ్ములందరు ముగ్ధులైనారు; వలచి వాంఛించుచున్నారు. మాలో నంతఃకలహములు, గృహ కల్లోలములు లేకుండుటకై నీమె నందరము నేకముగ చేబట్టుటయే శ్రేయస్కర"మని యభిప్రాయమును వెల్లడించెను.

అంతటితోనైన ద్రౌపది సౌశీల్యముగాచి కాపాడబడినదా? కృష్ణుడట! రాధేయుడట!! కూని సేవకుడట!!! ఎన్ని పుక్కిటి పురాణములు! అమంగళ మప్రతిహతమగుగాక! ఎట్లయిననేమి పంచకన్యలలో పాంచాలి యొకతెగదా? ఇక పాండవులు సౌందర్యరాశి ద్రుపదనందనతో సంతుష్టులైనారా? ధర్మజునకు వేదిక, భీమునకు జలంధర, అర్జునకు సుభద్ర, ఉలూపి, చిత్రాంగద, నకులునకు రేణుమతి, సహదేవునకు విజయ- ప్రియసఖులట!

స్త్రీ యొకనికన్న నధికముగ వివాహమాడు సందర్భములు-యొక్క ద్రుపదరాజపుత్రి స్వయంవరమే గాక మరికొన్ని నిదర్శనములున్నవని వ్యాసుడు వక్కాణించెను. అవి గౌతముండైన జటిలుండను ఋషి కూతురు తపఃప్రభావంబున నేడ్వురు ఋషులకు నొక్కతె భార్యయగుట, దాక్షాయణి యను మునికన్యక ప్రచేతసు లనంబరిగిన పదుండ్రకునొక్కతె యర్ధాంగిగానుంట, సౌవీరపతికన్యక నజితయను నామె నితంతుండను రాజర్షి కొడుకులు సాల్వేయ, శూరసేన, శ్రుతసేన, సినాబిందు, సరారిసారులను నేవురపతులగొంట మున్నగునవి. కాని వీటియుదంతములు కృష్ణద్వైపాయనుడు ప్రమాణములతో విశదముగ నిరూపించలేదు. ఇది కేవలము ద్రుపదుని మనోవంచనకై కల్పింపబడ్డ కట్టుకథ లేమో?...

సూక్ష్మదృష్టికలవారు పై నామములుగాక మరికొన్ని నిదర్శనములు గలవని సర్వసాధారణముగ జేర్కొనునవి భారత ప్రయోగములు మూడు: అవి బ్రాహ్మణకన్యలు జటిల వార్క్షులు, ఉతాత్యునిభార్య మమత, యయాతికొమరిత మాధవి. ఈ నిదర్శనత్రయమును నొక్కటైనను విమర్శనకు నెదుర్కొనలేదు. సరికదా యాజ్ఞసేని వైవాహిక విషయమునకు కించిత్తైనను సహాయపడవు. ఈ నిదర్శనములు కేవలము నామమాత్రావశిష్టములగుటచే యనవసరముగ విమర్శనను పొందుపరచి వ్యాసమును విస్తరింపజేయుట నా యభిమతముగాదు. కుతూహలము గలవారు భారతమున నాయాఘట్టములు పరికించుచో నీ నిదర్శనములు పూర్వపక్షమున హేతువుకు చూపింపబడినవేగాని సందర్భానుసారములు గావని తప్పక స్ఫురించును. మరి కొందరు కౌరవులలో సహితము నియోగము ప్రబలియుండెడిది. చిత్రాంగద విచిత్రవీర్యులు సంతతిలేక గతించుటచే విచిత్రవీర్యుని భార్యలగు అంబిక, అంబాలికలు నియోగమునకు బాల్పడిరి. ఆ ఫలితముగనే ధృతరాష్ట్ర పాండురాజులు జన్మించిరి. గిందముడను మునిశాపవశమున పాండురాజు భార్యా సంభోగమునకు దూరుడగుటచే నతని భార్యలు కుంతీమాద్రులు నియోగమువలననే పుత్రులను గాంచిరని రూపించుచున్నారు. నియోగమునకు వివాహమునకు భేదము హస్తిమశకాంతరముగలదు. నియోగమును వివాహమునకు సాటితెచ్చి వాదింపజూచుట సమంజసముకాదు. వంశోద్ధారణకై యాచరించిన నియోగము పెక్కుసారు లవలంభించిన పాపమని ధర్మశాస్త్రము బోధించినది. నియోగమునకు మొదటనే యజుర్వేదము యసమ్మతిని చూపినది. దారిచూపిన 'మనువు' వెంటనే యిది పశుప్రాయమని నిరసించినది. అందువలన నీవాదన సహిత మామోదింపదగ్గదికాదు.

# పాండవు లెవరు?

పై విషయముల నవగాహముచేసికొనిన పిమ్మట ద్రౌపది వివాహము హిందూ సాంప్రదాయము నకు వ్యతిరిక్తమని నిర్ధారణ చేయవచ్చును.

భీముడు కౌరవులొనర్చిన దుండగములు సహించలేక రోషావేశంబున 'ప్రపంచములోనున్న యుద్ధ వీరులారా! యిదిగో, నా ప్రతిజ్ఞ వినుడు. దుర్మార్గుడైన నీ దుశ్శాసనునిగుండె చీల్చి నే నీరక్తమును త్రావనిచో పితృలోకమునకు దూరుడనగుదు'నని గర్జించెను. ఇది విని సభికులందరు తామసపు పలుకులని తలపోసిరి. కాని భారత గ్రంధకర్త 'వీరక్షత్రియుడాడిన పలుకులు ప్రాణములుండువరకు నెరవేర్పబడునవేగాని యలవిగ దలంపవలనుపడ'దని రచియించెను. పోనిండు పౌరుషమునకై యాడిన పలుకులైన నెరవేర్చుకొనుటకై శత్రు రుధిరమును తిలకము నిడుకొనుటో లేక నామమాత్రముగ నించుక నాలుకపై నిడుకొనుటలో జరుపవలయును గాని శత్రువును చంపి వక్షస్థలముపై కూర్చొని, చీల్చి రక్తమును దోసెళ్లతో మరలమరల త్రావి "తల్లిపాల కన్నను రుచికరముగ నున్నది. మధువుకన్నను మధురముగ నున్నది. రుధిరముకన్నను యింపుగనున్న"దని సంతోషాతిరేకమున కేకలిడుటేమి? కదనరంగముననున్న వీరులు, 'ఇది మానుషకృత్యముగాదు. వీడు మానవుడు గాడు రక్కసుడైయుండనోపు'నని యాభీకరకృత్యమును చూడజాలక పెడమొగమిడి తొలంగిచనిరి. ఇందు వలన పాండవ సమకాలికులకీ కృత్యము నూతనముగను, నదివరకు కనివిని యెరుంగనిదిగను తోచినదని విశద ముగ తెలియుచున్నది.

హిందూవివాహ సంప్రదాయమునకు వ్యతిరిక్తముగ స్త్రీ పెక్కురను వివాహమాడు పద్ధతికలిగి, పురుషులు శత్రువులను చంపి రక్తముత్రావు యాచారముగల నేదేని యితరదేశమునుండి పాండవులు వలస వచ్చినారేమో ఇంకను పరిశీలింతము—

పాండవుల జనన వృత్తాంతమొకవింత. పాండురాజు కుంతి, మాద్రులతో నాగశైలము, చైత్రరథము, హిమవంతము, గంధమాదనము, హంసకూటము నతిక్రమించి శతశృంగపర్వతముపై నివసించుచుండెను. పాండు రాజు పాండురోగి. యాపైని ఇందముడను ముని శాపవశమున భార్యా సంభోగదూరుడు. అతడు సంతానా పేక్షతో భార్యలను నియోగమునకు పురికొల్పెను. పృధ (కుంతి) దూర్వాసుని మంత్ర ప్రభావంబున ధర్మా నిలశక్రుల ప్రసాదంబున యుధిష్టిరభీమార్జునులను ముప్పురుపుత్రులను యొక్కొక్కనికి వత్సర వ్యత్యాసమున బడసెను. మాద్రి కుంతియుపదేశమున మంత్రమునేర్చి యశ్వినీదేవతల వలన నకులసహదేవులను యిరువుర కవల పుత్రులను బడసెను. కొంతకాలమునకు పాండురాజు కనిష్టభార్యాలోలుడై శాపమునకు గురియై యసువులను బాసెను. స్వయంకృతాపరాధమునకు ప్రాయశ్చిత్తముగా మాద్రిసహగమనముచేసెను. పాండురాజు చనిపో యిన పదునేడవనాడు హిమాలయమున కావలనున్న ఋషులు కొందరు భర్తృహీన కుంతిని పుత్రపంచక మును హస్తినాపురమునకు గొనితెచ్చి భీష్మునియందు నునిచి యాశ్చర్యకరముగ నదృశ్యులైరి. పాండవులు హస్తినాపురము చేరుసరికి ధర్మజునకు పదునారు, భీమునకు పదునైదు, అర్జునునకు పదునాల్గు, కవలకు పద మూడు సంవత్సరముల ప్రాయమని చాటుపద్యమణిమంజరి ప్రధమభాగమున పాండవవర్ణనము తెలియజేయు చున్నది. భారతమున పాండవులు హస్తినాపురము చేరగనే పుత్రపంచకమును సత్యవతి, అంబికాంబాలికలు యెత్తుకొని ముద్దులిడిరని చెప్పబడియున్నది. పై నుదహరించిన ప్రాయమే నిజమైనచో యీ భారతవర్ణన కవకాశముండునో లేదో పాఠకలోకమే నిర్ణయింతురుగాక! ఈ యుదంతమువలన బహుశః పాండవులు హిమాలయమున కావలనున్న యొక కొండజాతి తెగవారేమోయని సందేహింప నవకాశము గలుగుచున్నది.

ఏషియాఖండమున నుత్తరభాగమున నొక తెలివిమీరిన కొండజాతి ప్రబలియుండెడిది. డాక్టరు థామస్ (Dr. Thomas) 'సకస్థాన' మను పొత్తమున భారతకాలమున నీకొండజాతివారు ఏకాయి మొదలు సకస్థానమువరకు విస్తరించియుండిరని నుడివియున్నాడు. పాండవుల జన్మస్థానమగు శతశృంగము సహితమీ రాజ్యమునయుండెడిది. వీరిలో స్త్రీలకు పురుషులతో సమముగ హక్కులుండెడివి. స్త్రీలు పెక్కుపురుషులను పెండ్లాడు యాచారముగలదు. స్త్రీ బంధుబాంధవులతో స్నేహాభివృద్ధికొరకై వ్యభిచరింపవచ్చును. పురుషుడు శత్రువును చంపి రక్తము త్రాగుయాచార మాచరణలో నుండెడిది. అందువలన హిందూ వివాహసాంప్రదాయమునకు వ్యతిరిక్తముగను, యమానుషముగను శత్రురక్తమును ద్రావి ప్రవర్తించిన పాండవులీతెగకుచేరినవారేమో?

భారతముననున్న పాండవులవంశవృక్షమునుజూచి పాండవులుకౌరవులు అన్నదమ్ముల బిడ్డలనివిశ్వసింపనవకాశములున్నవి. కాని, పాండురాజు కురువంశజుడై యతని సంతతి కౌరవులుగాక పాండవులని ప్రత్యేకింపబడుట యాశ్చర్యకరమే. పేరులను విశ్వసించి వంశము నిరూపించుట కేవల మమాయకము. కురువంశమున ఋక్షుడు, జనమేజయుడు, పరీక్షిత్తు, ధృతరాష్ట్రుడు, పాండునామము లధమను రెండు పర్యాయములైనను దొర్లినవి. శంతనుడు ధృతరాష్ట్రుని మనుమడు. మరల ధృతరాష్ట్రుడు శంతనుని మనుమడు. అందువలన పేరులను బట్టి వరుస నిరూపించుటకు చాల నప్రమత్తతతో నుండవలయును. దాసబ్రాహ్మణ జాతకమున నొకచోట (జాతక 413) ధనుంజయుడు కురురాజు, యుదిత్తల వంశీయుడు, ఇందపత్తను పురమున నివసించెననియున్నది. మరియొకచోట (జాతక 515) ధనుంజయ కోరబ్యయను కురురాజు చాలధార్మికుడు. ఇతనికి యుదిత్తనామము గలదని వక్కాణింపబడినది. ఇంకొకచోట (జాతక 329) ధనుంజయుడు కాశీపట్టణపు రాజుని చెప్పబడినది. వేరొకచోట (జాతక 185) పాండవ శబ్దమశ్వముల కుపయోగింపబడినది. మొత్తముపై జాతకములలో భారతకథ పూర్తిగలేదు. వేదమంతయు కలయవెదికినను పాండురాజు, యతని కుమారులు పంచపాండవుల విషయమై ప్రస్తావన కానరాదు. యజుర్వేదమున కౌరవపాంచాలుల నామములే గాన్పించునే గాని పాండవశబ్దములేదు. మొత్తముపై నొకచో చెప్పబడిన విషయమింకొకదానితో నన్వయించదు. ఒకటి యేటికీడ్చిన నింకొకటి కోటికీడ్చుచున్నది. అందువలన బహుశః పాండవులు ఏషియా ఉత్తరభాగమున కొండజాతివారికి జెంది, యటనుండి హిందూదేశమునకు వలసవచ్చి పాంచాలులతో స్నేహమొనర్చి కౌరవులపై కత్తిదూసి, కదనరంగమున జయించి రాజ్యమాక్రమించుకొని యుందురు. పాండవులు హిందూదేశీయులో, కారో నిర్ణయించుటకు మనకు లభ్యమగు నిదర్శన సంగ్రహమత్యల్పము అందువలన యిదమిద్ధమని తెల్పుట కష్టసాధ్యమైనపని. కాని పాండవులితర దేశీయులేమోయను సంశయమునకు తావుమాత్రము గలదు. ఈయనుమానమును కూకటి వేళ్లతో పెకలించి పారవేయగల బాధ్యత భారతాభిలాషులగు సోదరీమణులపై నాధారపడియున్నది.

శ్రద్దధానశ్శుభాం విద్యామాదదీతావరాదపి,
అంత్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి.

శ్రద్ధగలవాడు తనకంటె దక్కువవాడైనవానికడనుండియైనను నుత్తమవిద్యను గ్రహింపవలయును. అంత్యజునియొద్దనుండియైనను నుత్తమధర్మమును నేర్వవలయును. తక్కువకొలమువాని కడనుండియైనను స్త్రీరత్నమును గ్రహింపవలయును.

—మనుధర్మ శాస్త్రము

# వింత వింతల ప్రపంచం

15-వ శతాబ్దంలో జర్మనీలో ఒక యిల్లాలుకు 38 గురు మగపిల్లలు, 15 గురు ఆడపిల్లలు మొత్తం 53 పిల్లలు పుట్టారు. ఆమె జ్ఞాపకార్థం జర్మనీలోని వర్టెంబర్గులో 1935 సం||రంలో స్మారకచిహ్నం రాతితో నిర్మించారు. 1926 లో స్పైన్ దేశంలో ఒక స్త్రీకి 68వ యేట 29వ మగశిశువు కలిగాడు. అంటే ఆమెకు అంతకుముందు 28 గురు మగపిల్లలు జన్మించారు. లెక్కలనుబట్టి చూస్తే 3300 స్త్రీలల్లో ఒక స్త్రీకి 50 సంవత్సరాలు వయస్సు దాటిన తరువాత పిల్లలు పుట్టడం కలదు. 1928 లో ఈజిప్టులో ఒక స్త్రీకి నలుగురు ఆడపిల్లలు యిద్దరు మగపిల్లలు ఒకేసారి ఉద్భవించారు. 1934 లో డియోనీ అను కెనడాదేశపు స్త్రీకి అయిదుగురు ఆడపిల్లలు ఒక్కమారు జననమయ్యారు. ఆ అయిదుగురు తరువాత జీవించారు కూడాను.

♦ ♦ ♦ ♦

గ్రేటుబ్రిటను ఉత్తర అయిర్లండులో ప్రతిరోజూ వెయ్యికిపైగా పెళ్లిళ్లు జరుగుతూవుంటాయి. సాలుకు సగటున 375,000 పెళ్లిళ్లు జరుగుతాయి. గ్రేటుబ్రిటనులో పెళ్లిచేసుకునే మగవానిసగటు వయస్సు 29. పెళ్లికూతుళ్ల సగటు వయసు 26. భార్యపోయిన తరువాత తిరిగి వివాహం చేసుకునే మగవాని సగటు వయస్సు 50. తిరిగి వివాహము చేసుకునే వితంతువుల సగటువయసు 45. గత జనాభాలెక్క ప్రకారం ఇంగ్లీషు వారిలో నూటికి 52 మంది అవివాహితలే. 44 మంది వివాహితులు, 4 గురు భార్యపోయినవాళ్లు. ఆడాళ్లలో నూటికి 50 మంది అవివాహితలు, 41 వివాహితలు, 9 గురు వితంతువులు. రాబర్టు థీమ్ అనే ఆయన ఒకభార్య పోయిన తరువాత మళ్లీ పెళ్లి చేసుకుంటూ, అల్లాగ 15 పెళ్లిళ్లు చేసుకుని 103 వ యేట 1935 లో చనిపోయాడు.

♦ ♦ ♦ ♦

మేఘములయెత్తు వాటినిఆపే గాలియొక్క ఉష్ణతనుబట్టి మారుతూవుంటుంది. భూమధ్య రేఖవద్ద ఆరుమైళ్ళయెత్తున వుంటాయి. గ్రీన్‌లాండుదగ్గర అరమైలుకంటె యెక్కువ యెత్తునవుండవు.

♦ ♦ ♦ ♦

మనిషి ఊపిరితిత్తులు విప్పితే 156 చ|| గజములుస్థలం ఆక్రమిస్తాయి. అంటే 500 మంది జనం నుంచో డానికి తగినప్రదేశం. 60 సం||రము వయస్సుగలమనిషి తన జీవితకాలంలో 508,000,000 మార్లు గాలి పీలుస్తాడు. తద్వారా 9,600,000 ఘనపుటంగుళములు గాలి వూపిరితిత్తులలోకి వెడుతుంది.

♦ ♦ ♦ ♦

ఇండియానుంచి టిబెట్టుకు వెళ్లే రోడ్డును సంరక్షించడానికి 19,500 అడుగులయెత్తున వున్న డాంకియాలా కనుమవద్ద అయిదుగురు మనుష్యులు ఒక రాతిగుడిసెలో కాపురమున్నారు. మనుష్యులు కాపురముండే యెత్తైనప్రదేశం ప్రపంచంలో కల్లా యిదే

♦ ♦ ♦ ♦

ప్రపంచంలో చాల జలమయంగావున్న భాగం పదునాలుగుకోట్ల చదరపుమైళ్లు. పసిఫిక్ మహాసముద్రము విస్తీర్ణము 6 కోట్ల 70 లక్షలు. అట్లాంటిక్ 3 కోట్ల 40 లక్షలు. ఇండియన్ మహాసముద్రము 1 కోటి 80 లక్షలు. ఆర్కిటిక్ మహాసముద్రము 54 లక్షలు. అంటార్కిటిక్ మహాసముద్రము 1 కోటి 2 లక్షలు పసిఫిక్ మహాసముద్రము కొన్నిచోట్ల 30 వేలడుగుల లోతున్నప్పటికి మనిషి యింతవరకు దిగగలిగినలోతు 3028 అడుగులు మాత్రమే.

—వారణాశి భాస్కర మహాలక్ష్మి.

# పందెం ★

★ శ్రీమతి నందగిరి ఇందిరాదేవి

చిత్తైకాగ్రత, ప్రశాంతత కలిగివున్న జైలుజీవితమంటే జలదరించిపోతారు——

కాని, ఇదే - శాస్త్రపరిశోధనలకీ, నూతన గ్రంధరచనలకీ ఎంతో ఉపకరిస్తోంది——

జైలుజీవితం – ఒకరికి జీవితజ్యోతులను ప్రసాదిస్తూవుంటే, ఒకరికి జడత్వాన్ని ఆపాదిస్తూవుంది.

అయితే, యీ తేడా మానవప్రకృతిలోనే - కాని జైలుజీవితంలో కాదు——

కాగా, బందిఖానా అంటే భయమెందుకు ?

ఆనాటి సాయంకాలం స్నేహితులంతా సేటు రాజారాం ఇంట్లో విందారగించి కులాసాగా కబుర్లుచెప్పుకుంటూ కూర్చున్నారు. వివిధ విషయాలను చర్చిస్తున్నారు. వాదిస్తున్నారు. ఉత్సాహంగా సేటు రాజారాం తెల్లటి ఫర్షుమీద ఉన్న పట్టుదిండ్లకొరిగి హుక్కా పీలుస్తున్నాడు అవసరమని అనుకొన్నచోట్ల తానుకూడ పాల్గొంటూ. దగ్గర నిలువబడియున్న నౌఖరు లక్ష్మన్ కాళీయైన గాజుగ్లాసుల్లో వైను నింపుతున్నాడు. స్నేహితులు సేటు బలవంతంచేయాలని బెట్టు సరిగానే కాళీచేస్తున్నారు పాత్రలు. సేటు 'లక్ష్మన్! మొన్న ప్రత్యేకంగా ఆర్డరిచ్చి తెప్పించిన సీసా తీసుకురా' అన్నాడు. లక్ష్మన్ తెచ్చి మళ్ళీ గ్లాసుల్లో నింపాడు. స్నేహితులు ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు. 'సేట్ ! వేపారం బాగా సాగుతున్నట్లుందే! అన్నాడొక స్నేహితుడు. 'అవును మరి లేకపోతే ఇంత ఖరీదుగల వైను తెప్పించటం సామాన్యమా' అన్నాడు మరొకడు లక్ష్మన్ అందిచ్చినగ్లాసు తీసుకుంటూ. సేటుకూడ గ్లాసులోనిది కొద్దిగా చప్పరించి స్నేహితులవంకచూచి మందహాసంచేశాడు.

గ్లాసులు కాళీకావటంతో ఉత్సాహం ఇనుమడించింది అందరికీ. అంతకుముందుదాకా చర్చిస్తున్న విషయం మళ్లీ ఎత్తుకున్నారు.

'మీరు ఏమన్నా అనండి! యావజ్జీవం ఖైదుశిక్ష అనుభవించటం చాలా ఘోరం. అంతకంటే రెండు నిమిషాల్లో ప్రాణంపొయ్యేటట్లు ఉరితీయటం మంచిది.' అన్నాడు రాంలాల్ పట్టుదలగా.

'బతికితే బలుసాకయినా తినొచ్చు. అసలే లేకుండా అంతమొందటం కంటె ఎట్లాగో ప్రపంచం మీద ఉండటంనయం' అన్నాడు నరోత్తందాసు. 'ఏమీ స్వేచ్ఛలేక జీవితాంతంవరకు ఆశలన్నీ చంపుకొని బతకి బాధపడటంకంటె ఉరిశిక్ష అనుభవించటం చులకనగాదూ' అని తానుకూడా ఒక సమిధవేశాడు సేటు.

'ఈ రెండుశిక్షలూ నాగరికతగలదేశాల్లో గర్హ్యమయినవి. నెమ్మదిగానో తొందరగానో వ్యక్తుల ప్రాణాలుతీయటమే ఈరెంటి ఉద్దేశం. కాని తప్పుచేసినవాళ్లను మంచిమార్గంలో ప్రవేశపెట్టటానికి బదులు సంఘంలోనుండి వాళ్లను పూర్తిగా అంతమొందించటం దెబ్బతగిలినవేలును పూర్తిగా కోసివేయటం వంటిది' అన్నాడు లలితాప్రసాదు చేతిలోనిసిగరెట్టు బూడిద దులుపుతూ. నిజమే! ఈ రెండిలో నాకయితే యావజ్జీవశిక్షే నయమనిపిస్తుంది' అన్నాడు నరోత్తందాసు. సేటువంకచూస్తే సేటు తనమాటను పడగొట్టాలని అన్నట్లుగా అనుకొని 'యావజ్జీవం ఏమిటోయి? ఒక ఐదేండ్లు ఉండలేవు! ఏకాంతంగా యావజ్జీవం

గడపాలంటే మాటలా?' అన్నాడు సేటు పూర్తిగా వాదనలోకి జొరబడి. ఇద్దరికీ తమమాట నెగ్గాలన్న పంతం ఎక్కువయి వాదన ముదురుతోంది. స్నేహితులు వాళ్లకు పొగవేస్తున్నారు తాము తమాషా చూస్తో.

'ఐదేళ్లుకాదు పదేళ్లుంటాను నువ్వు ఎట్లా చెప్పితే అట్లా' అన్నాడు నరోత్తందాసు.

'ఆ! పందెం రెండు లక్షలు!' అన్నాడు సేటు ఉద్రేకం పట్టలేక.

'ఓ సిద్ధం! నువ్వు రెండులక్షలు గుమ్మరించాలి మరి?' అన్నాడు నరోత్తందాసు.

'తప్పకుండా?' అన్నాడు సేటు.

ఇంకేముంది? వ్యవహారం ముదిరింది. సేటు రాజారాంతోటలో పదేళ్లపాటు ఏకాంతవాసం నరోత్తందాసు అనుభవించేటట్లు తదుపరి నరోత్తందాసుకు సేటు రెండులక్షలు ఇచ్చేటట్లు ఒప్పందం చేయించారు స్నేహితులు.

సేటు అంతా అయిపొయ్యాక కళ్లుతెరిచాడు. 'ఎంతపని జరిగింది? ఎందుకు పచ్చినట్లు ఈ రెండు లక్షల దండుగ!' అన్నాడు స్నేహితులతో. స్నేహితులందరూ రెండులక్షల కొరకు వెనుకనుపొయ్యే పీనాసి అని బనాయించేరు. సేటు సిగ్గుతో మారుమాట్లాడక ఒప్పందం అంగీకరించాడు.

తోటలో ఒకగది ప్రత్యేకించారు నరోత్తందాసుకొరకు. సరిగ్గా పదేళ్లకు ఏ రెండునిమిషాలు తక్కువయినా కూడా రెండులక్షలు చెల్లించే బాధ్యత సేటుకు ఉండదు. ఖైదీకి కావలసిన వస్తువులు అర్డరు వ్రాసి తెప్పించుకోవచ్చు. పుస్తకాలు బట్టలు భోజనం వగైరాలు అతనికి బాహ్య ప్రపంచంతో ఏమాత్రం సంబంధం ఉండకుండా ఈ వస్తువులన్నీ కిటికీ ద్వారానే వెళ్లవలసి ఉండేవి. ఖైదీ కావాలంటే ఉత్తరాలు వ్రాసుకోవచ్చు.

మొదటి సం||రమంతా చాల విసుగ్గా, విచారంగా గడిపాడు ఖైదీ. ఎన్నోసార్లు ఏడవటంకూడా వినపడేది అక్కడి చౌకీదారుకి. రెండుమూడేళ్లు గడిచాక ఈ ఒంటరి జీవితానికి అలవాటుపడ్డాడు. రాత్రింబగళ్లు చదవటమే చదవటం. ఈ ఖైదీ కావలెనని వ్రాసి పంపిన పుస్తకాలు తెప్పించలేక అవస్థపడేవాడు సేటు. తన స్థితిని గురించి విచారపడటానికి సమయమే చిక్కకపోయేది ఖైదీకి.

ఒకనాడు సేటుకు ఖైదీ పదిభాషలలో ఒక ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరం ఆయాభాషలు వచ్చినవాళ్లకు చూపెట్టుమని తప్పులులేకుండా సరిగా ఉన్నట్లయితే తోటలో శంఖు ఊదమని వ్రాశాడు. అట్లాగే శంఖు ఊదారు.

సేటు రాజారాంకు ఇదంతా చూస్తే చాల ఆశ్చర్యమైనది. ఈ ఏకాంతవాసం పదేళ్లపాటు అనుభవించపోతాడా? నేను రెండులక్షలియ్యబోతానా అనుకున్నాడు సేటు. మొదటి సం||రంలోనే భరించలేక ఆత్మహత్య చేసుకుంటాడని ఆశించిన సేటు చూస్తుండగానే నాలుగేళ్లు గడిచిపోవటం, అందులో ఖైదీ ఏమాత్రం ఒంటరితనం 'బాధ' అనుభవించటంలేదని తెలుసుకొని కిటకిట పడ్డాడు.

◆ ◆ ◆ ◆

'రేపు ఉదయంవరకు పదేళ్లు నిండుతాయి. మా ఒప్పందం ప్రకారం అతనికి రేపు నేను రెండు లక్షలు గుమ్మరించాలి' అనుకున్నాడు సేటు. కాలం అంతా ఒక్కతీరుగా ఉండదు. పదేళ్లకింద రోజుకు

ఐదువందలు సంపాదించే సేటుకు ఇవ్వాళ యాభైరూపాయలు రావటం కష్టంగా ఉన్నది. వ్యాపారం నష్టం వచ్చి సన్నగిల్లటం మూలానా రెండురూపాయలు రెండులక్షల సమానంగా ఖర్చుపెట్టుతున్నాడు. 'రేపు ఎట్లాగూ ఇయ్యటం తప్పదు. ఇస్తే ఇంక నేను బిచ్చమెత్తుకోవాల్సిందే?' అంటూ ఎటూ తోచక పచారు చేస్తున్నాడు తనగదిలో. 'నే ననుకున్నట్లు వీడు చచ్చిపోతే ఎంత బాగుండేది! ఏ దిగులు లేకుండా!' అని గొణిగాడు మళ్లీ! ఇంతలో గడియారం రెండు కొట్టింది. కిటికీలోనుండి బయటికి చూచాడు. దట్టంగా చీకటి ఉన్నది. సన్నగా తుంపర పడుతోంది. చప్పున పెట్టెదగ్గరకు వెళ్లి ఎర్రటి మఖమలు ఒరలో మెరిసిపోతున్న చిన్న కరవాలం మొలలో దోపుకొని తాళపు చెవులగుత్తి పట్టుకొని బయలుదేరాడు. తోటలోకి వెళ్లి చేతిలోని టార్చి వెలిగించి చౌకీదారును పిలిచాడు. వాడు పలకలేదు అంతరాత్రి. 'మొదలు అనుమానం చౌకీదారుమీద పడుతుంది. తరువాత ఎట్లాగయినా తప్పించుకోవచ్చు' అని మొలలోఉన్న కత్తిని చూసుకున్నాడు. మెల్లిగా గదిదగ్గరకు వచ్చాడు. బల్లమీది లాంతరు వెలుగు కిటికీలోనుంచి కనబడుతున్నది. టేబిలుదగ్గర కుర్చీలో ఖైదీ కూర్చున్నాడు కిటికీవేపు వెన్నుచేసి. ఐదునిమిషాలు గడిచాయి. ఖైదీ కదలనేలేదు. 'పదేళ్లనుంచి ఇట్లా కదలకుండ కూర్చోటం అలవాటయింది కాబోలు' ననుకున్నాడు సేటు. కిటికీతలుపు చప్పుడు చేశాడు. అయినా కదల్లేదు. సేటు తలుపు తాళం వేశాడు. పదేళ్లకింద వేసిన తాళం, తీస్తుంటే కిర్రుకిర్రు మన్నది. తాను తాళంతీస్తే ఎంత ఆశ్చర్యంగా చూస్తాడో లేక ఏమన్నా అంటాడేమో ననుకున్నాడు. కాని అతడు కదలనన్నా కదలలేదు. గడ్డంజుట్టు బాగా పెరిగింది. చిక్కి-శల్యమయి ఉన్నది అతని శరీరం. సూర్యరశ్మిలేక ఒళ్లంతా పండుబారింది. టేబిలుమీద అన్నీ తెరిచిన పుస్తకాలు కుప్పలుగా పడిఉన్నవి. అతని ఒళ్లోకూడా ఒక పుస్తకం ఉన్నది. చదువుతూ చదువుతూ నిద్రపోయినట్లున్నది అనుకున్నాడు సేటు. 'ఇప్పుడు పొడిచివేయటం చాల చులకనయినపని' అని టేబిలువంక చూడగానే ఒక కాగితముమీద ఏదో వ్రాసి ఉన్నది.

అదితీసి దీపం వెలుతురులో చదవటం మొదలుపెట్టాడు.

'నేను రేపుఉదయం బంధవిముక్తుణ్ణి అవుతాను. నాకుస్వేచ్ఛవస్తుంది. కాని నేను ఈగది వదలి వెళ్లటానికిముందు కొన్నివిషయాలు నీకు విశదీకరించటం అవసరం.

ప్రపంచం అంతా పెద్దవాళ్లన్నట్లు మిథ్య. ఈ స్వేచ్ఛ, ఈ జీవితం బుద్బుదప్రాయాలు. ప్రపంచం పై మెరుగులతో నిండిఉన్నది. ఇట్లాంటి బూటకపు ప్రపంచంలో జీవించటం నాకిష్టంలేదు.

ఈ పదేళ్లబట్టి నేను ఐహిక సుఖాలన్నిటినీ పుస్తకాలద్వారా అనుభవించాను. తోటల్లో విహరించాను, ఆరామాల్లో విశ్రాంతితీసుకున్నాను, స్త్రీలను ప్రేమించాను, యాత్రలు సేవించాను, చూడదగినవి చూశాను, వినదగినవి విన్నాను, అంతా అనుభవమయినది నాకు.

నీపుస్తకాలవల్ల జ్ఞానం సంపాదించాను. నేను మీ అందరికంటె తెలివిగలవాడనయ్యానన నమ్మకం నాకుబాగా కుదిరింది.

కాని ఈ పుస్తకాలు ఈ జ్ఞానం అంతావ్యర్థం. ఎంతటివాడికయినా చావుతప్పదు. అందం, చందం, ధనం, ధాన్యం, తెలివి, గొప్పతనం అంతా చెల్లుదీనితో.

ప్రపంచం అబద్ధాన్ని నిజంఅంటుంది. పై మెరుగులన్ని నిజమయిన అందంఅని నమ్ముతుంది. ఇట్లాంటి లోకమే స్వర్గమని ఆనందిస్తుంది.

నాకు ప్రపంచమీద విసుగుపుట్టింది. ఇవేవి నన్నాకర్షించవు. కొన్నాళ్ళక్రింద రెండులక్షల ఆస్తికోసం ఎన్నోకలలు కన్నాను. అనుభవించినట్లే ఆనందించాను. కాని నేడు నాకవి అనవసరం, కనుక నేను నిర్ణీత సమయంకంటే ముందుగావెళ్లిపోయి మన ఒప్పందం విచ్ఛేదంచేస్తున్నాను'

సేటు ఇదంతాచదివి కాగితం అక్కడపడేసి 'నూరేళ్లు జీవించు నాయనా' అని నెమ్మదిగా వెళ్లిపోయినాడు. తెల్లవారి చౌకీదారు ఖైదీ పారిపొయ్యాడని బిక్కమొహం వేసుకొనిచెప్పాడు.

రాజారాంసేటు బల్లమీదఉన్న రెండులక్షలు ఒప్పందంవ్రాసిన పత్రంవంక ఒక్కమాటుచూచి డ్రాయరులో పడేశాడు.

# • కన్నీటిచుక్క •

విద్వాన్ పాలెపు వేంకటరత్నము

రైతుబిడ్డలు హేమంత రాత్రివేళ ద్వారములు మూసి శీత బాధానివార
ణార్థమై అగ్నిసవిధాన నలరుచుండ తలుపు మెల్లఁగా చేతితో తట్టి రెవరో?
విస్మయావిష్టులై కాపుబిడ్డ లపుడు తిరిగిచూడగ, వెలుపల దీనవాక్కు-
లిట్లు వినవచ్చె శక్తి విహీనమైన పేదమెలుఁగున డెందము వేదనపడ.
'తలుపు తెరువుఁడు మీయది ధర్మగృహము సగము చచ్చితి నిప్పుడే చలికి నేను
అంతులేని యీ మైదానమందు నన్ను హింసపెట్టుచు నున్నదీ యీదగాలి.
వాతరోగ సముత్పన్న బాధితమగు యీ కృశాంగమునైన భరింపలేవు
కంపితములగు యీ ముదికాళ్లు; మీకు పున్నెముండును! ఉదయాన పోదునేను.
బాధపడుచుంటి వార్ధక్యబాధ యొకటి యిపుడు తలుపు తీయక ఆలసింతురేని
యీ హిమావృత మేదినియే విశాల మా సమాధి ప్రదేశమై యలరునాకు'
రైతుమేల్కాంచి యీ యార్తరావమువిని వడిగవచ్చి, తలుపుతీసి, గడగడమని
వడకుచుండెడు ముదుకని వహ్నికడకు తీసికొనిపోయి చలిబాధ తీర్చినాఁడు.
అతని బిడ్డలు ముదుకని హస్తములను ఆత్మహస్తములం జేర్చి అగ్నిచేత
కాచి కాచి హిమంబుచే గడ్డకట్టి నట్టి యవయవముల సుఖపెట్టినారు.
అతని యిల్లాలు జాగుగానీక మంచి భోజన పదార్థములు చాల పొందుపఱచి
సేదదీరిన పిదప నా బీదవాని యాత్మ సుఖియించు నట్లుగా నన్నమిడిమె.
తనువు సుఖియింప నప్పుడా దైన్యజీవి వారి కభివందనంబులు వాక్కుతోడ
తెలుపఁగాలేక తనకనుఁ గొలఁకునుండి వేడికన్నీటి ముత్తెము విడిచినాఁడు.




# చిత్రలేఖనము

శ్రీయుత ఒంగోలు వేంకటరంగయ్య

(గత సంచికా శేషము)

ఒక మనుష్యుని ప్రతిమ వ్రాయబూని పిల్లవాండ్రు మనుష్యాకృతిజూపు పిచ్చిగీతలుగీయుదురు. ఇందు మనుష్యాకృతి లేదనవలను కాదు గాని ఇది చెయితిరిగిన చిత్రకారుని చెయ్యంబనియెవరును జెప్పరు. రవివర్మ తీర్చిన ప్రతిమలలో "అరవ స్త్రీ" యొకటి కలదు. ఆ పటమును జూడగనె పయ్యెదనుబట్టియు, ఆభరణ విశేషములనుబట్టియు, తలకట్టునుబట్టియు ఆ రూపవతి ఆంధ్ర స్త్రీ కాదనియు ద్రావిడ స్త్రీయనియు దెలియబడుచున్నది. ఈ ప్రతిమ ఇట్టిది యని చెప్పకనె ప్రతిమయె తన యుదంతము తానే చెప్పుకొనునట్లుండ వలయును.

సంగీతమునకును, శిల్పమునకును, చిత్రలేఖనమునకును కొంత సాజాత్యమును కొందరు చెప్పుదురు. సంగీతమున స్వరభేదములబట్టి భావభేదముల దెలిసికొనునట్లు శిల్పమునను చిత్రలేఖనమునను కూడ ఉచ్చనీచాదు లనుబట్టియు నిర్మాణ సన్నివేశమునుబట్టియు భావభేదములు సూచింపబడుచున్నవని తత్తత్కళానిపుణులు చెప్పుదురు.

ఇంగ్లీషు చిత్రకళలో పెర్‌స్పెక్టివ్ (perspective) యను నొక సంకేతము కలదు. ఈ భావమునకు మనదేశ చిత్రకళయందేమి సంకేతపదమున్నదో స్పష్టముగ దెలియలేదు గాని, ఈ పెర్‌స్పెక్టివ్‌యొక్క తత్త్వ మును దేశచిత్రకారులు చక్కగ గుర్తెరిగియుండిరనియు, మొగలాయి కాలపు చిత్తరువులలో నిది చక్కగ గమనింపబడినదనియు కళాకోవిదులు వ్రాసియున్నారు. ఒక పటముననో పరదామీదనో చాలదూరముపోవు పెద్ద వీధియు, దీనికిరుప్రక్కల ఇండ్లు చెట్లును చూపవలసియుండు సందర్భములో చిత్రకారుడు అట్టి దృశ్య మేర్పడుటకుగాను వీధి పోనుపోను సన్నగిలుచున్నట్లున్న వీధి మొదటనుండు ఇండ్లయొక్కయు చెట్ల యొక్కయు స్థౌల్యమును ఔన్నత్యమును తగ్గించుచు పోవును. ఒక సేన నడచిపోవుచున్నట్లుగాని లేక బహు జన మొక యుత్సవమును చూచుచున్నట్లుగాని యొక పటమున జూపవలసివచ్చినప్పుడు ఈ పెర్‌స్పెక్టివ్ విధానము ముఖ్యముగ కావలసియుండును. ఈ విధానమును మనదేశ చిత్రకారులు బాగుగ గుర్తెరింగి అనుష్ఠించు చుండిరి. వాత్స్యాయనుడు కామసూత్రములలో చిత్రకళకుపపాదించిన షడంగములలో ప్రమాణము అను అంగమున ఈ perspective భావమును చేరియున్నది. ఆ షడంగము లెవ్వియనిన (1) రూపభేదము (2) ప్రమాణము (3) భావము (4) లావణ్యయోజనము (5) సాదృశ్యము (6) వర్ణికభంగము - Light and Shade

నిమ్నోన్నతములు - తేజస్తిమిరములు - ఛాయాప్రకాశములు - ఇత్యాదులు లావణ్యయోజనమున చేరునట్లున్నది. Light and Shade అనుటకు మన చిత్రకారుల పరిభాషాపదమేదియో తెలియలేదు.

ఐరోపీయ చిత్రలేఖనమునకును మనదేశపు చిత్రలేఖనమునకును గల గొప్పభేదము నొక గ్రంథకర్త యిట్లు వర్ణించియున్నాడు. ఐరోపీయ పద్ధతి స్థూలము ననుసరించియుండుననియు (mass) దేశశిల్పము రేఖను (line) అనుసరించియుండుననియు - అనగా ఐరోపీయ శిల్పిగాని చిత్రకారుడుగాని ఒక మల్లునో (wrestler) యుద్ధభటునో నిర్మించినపుడు వాని దేహపటుత్వము దెలియునటుల మాంసకండరముల వికాసమును పుష్టిని వర్తులమును జూపును. ప్రాతకాలపుదేశచిత్రములలో ఈ పద్ధతి యగుపడదు. శ్రీ కృష్ణుని ముద్దుమోము జూపవలయునన్న మన చిత్రకారుడు ఒక రేఖవలన అతని కన్నుల తీరు - బుగ్గల ముద్దు - చిన్న బొజ్జ ఇట్టివన్నియు జూపును. స్త్రీ యొక్క అవయవ విన్యాసప్రదర్శనమునకును ఇట్టి రేఖనే ప్రయోగించును. ఆ రేఖ వలన భావస్ఫూర్తి కలుగుచున్నది. నవీనులు ఐరోపీయ పద్ధతినే యవలంబించుచున్నట్లున్నది.

చిత్రలేఖనమున మనదేశపు ఔన్నత్యమున కుదాహరణముగ కొందరు కొన్ని విచిత్రపు కథలు చెప్పుదురు. చిటికినవ్రేలి గోరునుచూచి మనుష్యుని ఆకృతినంతయు యథారూపముగ చిత్రించువారుండిరట. ఒక స్త్రీని జూచి ఆమె రూపపటము వ్రాయ నాతడు ఎవ్వరికిని యగపడని ఆమెలోతొడమీద యొక పుట్టుమచ్చ యున్నట్లు వ్రాయునట. ఇట్టివి యూహాలో శాస్త్రముచే సాధ్యములో విచారింపవలసియున్నది. చిత్రలేఖనమున నిట్టివి సాధ్యములగునో కాదో గాని జంతుశాస్త్రజ్ఞులు (Naturalists) ఒక యెముకనుజూచి జంతు స్వరూపమునంతయు నిర్మింపదగియుండుట గ్రంథముల జదువుచున్నాము. ఒక ఎముకనో లేక నొక పంటినో జూచి నిశ్శేషములయిపోయిన మాస్టొడాన్, మామ్మత్ లోనగు (Mastodan, Mammoth) జంతువుల రూపము లిట్లుండునని గ్రంథములలో చూపుచున్నారు. ఇది విశ్వసనీయమగునేని అనుభవసిద్ధముగ శిల్పికిని చిత్రకారునికి ఇట్టి నేర్పరితనముండవచ్చును. రవికాంచనిది కవిగాంచునను సామెత కలదు గదా. పౌరాణిక బౌద్ధయుగముల వెనుక మనదేశమున రాజపుత్రస్థానము (Rajputana) చిత్రకళాపోషణకు ముఖ్యాలంబనమయిన ట్లున్నది. దేశచరిత్రలో ప్రసిద్ధులగు పృథ్వీరాజు లోనగు ప్రాచీన దేశవీరుల రూపపటముల మాతృకలా దేశమున నున్నటులున్నది. ఉత్తర హిందూదేశపు చిత్రకళా వ్యాప్తిని కొందరు మూడు ఖండములుగ విభజించిరి. (1) రాజపుత్రస్థానము (2) ఢిల్లీ ప్రాంతములు (United Provinces) (3) బంగాళాదేశము. దేశమున మహమ్మదీయ ప్రభుత్వము నాటుకొనినతరువాత మొగలాయి చిత్రలేఖనమును ప్రాచుర్యము పొందియుండినది. ఆయా దేశపు చిత్రలేఖనమోడి (పద్ధతి) ఒకవిధముగ నుండెడిది. ఇట్టి భేదమును కొందరు "కలం" అందురు. చిత్తరువును చూడగనే ఇది రాజపుత్రస్థానపు మోడిలో వ్రాయబడినది, ఇది మొగలాయి మోడిలో చిత్రింపబడినది అని నిర్ణయించుటకు అనువగు కొన్నికొన్ని భేదములు కొన్నికొన్ని అభ్యాసములు (వాడుకలు) కనుపడుచుండగలవు. ఈ భేదములు వస్త్రపరిధానమునందును ఆభరణ విశేషములందును కన్నుముక్కుల కుదిరిక యందును యుండును. ఒయ్యారమునందును కనుపడగలదు. సంగీతమునందును ఆయా దేశవాసులను ఈ పాటకుని సంగీతము తంజావూరు బాణి (వాణి) యనియు ఈ పాటకునిది మైసూరుబాణి (వాణి) యనియు ఇత్యాది సంకేతములుగలవు. అటులనే చిత్రలేఖనమందును ఆయాదేశ "కలం" లేక ఖత్తు అనియు చెప్పుట గలదు. "కలం" అనగ వ్రాయు సాధనము (pen or pencil) ఖత్తు అనగ అక్షరముల మోడి. ఇట్టి భేదములను ఇంగ్లీ

షులో స్కూలు (School) అనుట గలదు. "ఇటాలియన్ స్కూలు" అనుట పలుమారు వినుచుందుము. మనదేశమున తంజావూరు స్కూలు - మైసూరు స్కూలు అను భేదముగలవు.

చిత్రలేఖనమున "ఆంధ్రకలం" ఒకటి ప్రసిద్ధముగ యేర్పడియున్నదా యని విచారింపవలసి యున్నది. సర్కారులలో కొండపల్లి రంగులు ప్రసిద్ధములుగ నుండినవి. దత్తమండల ప్రాంతము నోసం (Nossam) రంగులు ప్రసిద్ధములు. కొండపల్లి బెజవాడ సమీపమున నున్నది. నోసం కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలూకాలో నున్నది. యిరోపీయ రంగుల ముందును, జపాను రంగుల ముందును దేశపురంగులు అడుగున పడిపోవుచున్నవి.

చిత్రలేఖనమునందు నీటిరంగులు (Water Colours) తైలపు రంగులు (Oil Colours) అని రెండు ప్రధాన భేదములు గలవు. మన పూర్వీకులు, తైలవర్ణముల నేతైలముతో పక్వముజేయుచుండిరో స్పష్టముగ తెలియలేదు. మొగలాయి చక్రవర్తి జహాంగీరుకాలమున యిరోపీయులు తైలవర్ణము గల పటము నొకదాని జూపినట్లును తైలవర్ణచిత్రము నా చక్రవర్తి ఆమోదింపలేదనియు యొక గ్రంథమున గలదు. ఇందుకు కారణ మూహింపనగును. నీటిరంగులు తైలమిశ్రిత వర్ణములకంటె ఎక్కువ కాంతిగలిగి యుంటున్నవి. తైలవర్ణములు కొంచెము మబ్బుగ నుండును. అయితే తైలవర్ణచిత్రమున్నంత దీర్ఘకాలము నీటిరంగు స్థిరముగ నిలువదందురు గాని అజంతాగుహలలోని చిత్తరువులిన్ని శతాబ్దములెట్లు నిలిచియున్నవియో!

ప్రాచీనకాలమున తెలుగునాటివారి చిత్రకళా విజ్ఞానమెట్లు విలసిల్లినదో తెలుసుకొనుటకు ఆధారములు మృగ్యములుగ నున్నవి. ఆధునికులలో చిత్రలేఖనమున మహానిపుణులు ఆంధ్రదేశమున నవతరించిరి. కీర్తిశేషులు దామెర్ల రామారావుగారి చిత్రలేఖన పాటవము ఆంధ్ర స్కూలును (ఆంధ్ర కలం) నెలకొల్పినదని చెప్పనొప్పును. చిరంజీవులు శ్రీ బాపిరాజుగారును ప్రఖ్యాతులుగ నున్నారు. ఈ యిద్దరును చిత్రకళాచార్యులనదగుదురు. ఇపుడిపుడు ఆంధ్ర స్త్రీలును చిత్రకళా నైపుణ్యమును జూపుచున్నది. కొందరు స్త్రీలు వ్రాసిన చిత్ర ప్రతిమలుచిత్రములు భారతిని గృహలక్ష్మిని అపుడపుడు యలంకరించుచున్నవి. సామాన్యముగ విద్యాభివృద్ధిలోపాటు కళాభివృద్ధియు కాకమానదు. అందుచేత ఆంధ్రదేశమునకీ చిత్రకళా ప్రపంచమునను అత్యంత వ్యాప్తియు అభివృద్ధియు కలుగగలదని సంతసింపనగును.

పూర్వము తెలుగునాడునందు "చాందిని" (awning or canopy) అనునది యొకటి విశేషముగ నుండినది. చాందిని యనునది ఉర్దుమాటగ నుండును. తెలుగున ఉల్లెడలేక మేలుకట్టు-సంస్కృతమున వితానము. గొప్ప వెడలుపు పొడవుగల గుడ్డలమీద భారత భాగవత రామాయణాది కథలన్నియు చిత్రవర్ణముల వ్రాయబడుచుండినవి. ఒక్కొక మేలుకట్టు నాలుగు అంకణములు అయిదు అంకణములకూటమునకు కట్టుటకు సరిపోవుచుండును. పెండ్లిపందిటికి ముఖ్యముగ వీని కట్టుచుండిరి. కొన్ని యిండ్లలో ఇవి తరతరములుగ భద్రము చేసియుంచబడుచున్నవి. ఇవి ముఖ్యముగ బందరులోనను, కాళహస్తిలోనను, అనంతపురంజిల్లాలోని పామిడిలోనను చేయబడుచుండినవి. ఈ కాలపు నాగరకమున కివి ముతక సొగసులక్రింద చేరుచున్నవి కాబోలు. ఇపుడు రంగు కాగితముల పేలికల నంటించుచున్నారు. ఎచ్చటనైన పురాతన సంస్థానములందుగాని ఆఢ్య కుటుంబములలోగాని ఇప్పటికిని జీర్ణశేషములుండగలవు. వానిపై ఆయా పౌరాణికాది కథలు చిత్రింపబడుటయేగాక ఆయా బొమ్మలక్రింద వాని కథయు సంక్షేపముగ వ్రాయబడియుండును. ముఖ్యముగ కృష్ణలీలలు- శ్రీరామ

పట్టాభిషేకము ఈ చాందినీలలో చిత్రింపబడుచుండినవి. ఇపుడవి యగపడడము చాల తక్కువగ నున్నది. ఆ చిత్రనైపుణ్యము ఉపేక్షింపదగినది కాదు. దానిని ప్రోత్సాహముచేసి ఆ కళను ఉజ్జీవింపచేయతగును. ఈ గాంధీయుగమున తిరుగ ఆ చాందిని వంటివి కొన్ని చిత్రవర్ణములద్దబడిన గుడ్డలగుపడుచున్నవి గాని ఇవి ఉత్తరీయములుగను శాలువలుగను చేయబడుచున్నవి. పూర్వపు మేలికట్లతీరులేదు. ఆంధ్రులీకళ నభివృద్ధి జేయదగుదురు.

మన మహిళాజనము పిండితోగాని సీమసున్నముతోగాని చుక్కలుబెట్టుకొని ఆవల ఆ చుక్కలను గీతలతో కలిపి విచిత్రరూపములగు ముగ్గుల నమర్తురు. చిత్రకళకుగూడ ఇట్టి సాధనోపాయముండినట్లు కొన్ని గ్రంథములవలన దెలియుచున్నది. మొదట ఒకగీత (రేఖ) గీచుకొనుటయు దానినుండి ఇన్ని అంగుళముల ఏటవాలుగనో వక్రముగనో కొన్ని రేఖల గీచి వీనినొక సుకుమార భంగురమగు గీతతో కలిపిన మొగము ముక్కు ఏర్పడునను నిత్యాదిసూత్రములున్నవి. ఇవన్నియు నిపుడేమయినవియో? అట్లు ఏర్పడిన ఆకృతిమీద చిత్రలేఖకుని ఇష్టానుసారము రంగుల వేయవచ్చును. ఇట్టి గీతల కొలతల విషయమున నింకొక వైదికోదాహరణము చూపవచ్చును. శ్రౌత ప్రక్రియలందు వపయుండు స్థానము కనుగొనుటకు శ్రౌతులకు కొన్ని యుపాయములు గలవు. యాగపశు విశసన మయినపిదప దాని నాభినుండి ఇన్ని అంగులములు నిర్దిష్టదిక్కున కొలుచుకొని అచట కాటుపెట్టినయెడల అప్రయత్నముగ వప లభింపగలదు. ఆ కొలతల వ్యత్యస్తము జేసిన చాల కష్టపడి చేతులు పశువుయొక్క పొట్టలోనికి పోనిచ్చి ఇటునటు కలియబెట్టి చీకాకుపడుదురు.

చిత్రకళనుకూడ మన పూర్వీకులు క్షేత్రగణిత (Geometrical) పరిధిలో నిమిడ్చిరి. ఇట్టివాని నిప్పటి వారును ఉద్ధరింపదగుదురు.

గ్రంథవిస్తర భీతిచే ఈ వ్యాసమున నుదాహరింపబడిన గ్రంథములయొక్కయు గ్రంథకర్తలయొక్కయు పేళ్ళన్నియు తెలుపబడలేదు. మరియు ఆయా ప్రస్తావగత శ్లోకములను పూర్తిగ వ్రాయబడలేదు.

## ★ విరహి లేఖలు

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ

ఏ సతీపతుల యెడంద లేపుమీరు
ప్రణయబంధమ్ము లేనాఁడు రాచినానో!
మధురభావాల వెలయు హేమంత వేళ
లాఫల మనుభవింపఁగానయ్యెఁ జెలియ!
రేల నాహార మొనరించువేళఁ దుమ్మ
నంత "చిరఁజీవి" యంచేమొ - కొంతనవ్వి
యూరు, దైవమ్ము పేరులఁ బేరుకొనుఁడు
జీవితస్వామి! అందువే! యేది నేడు?
ప్రణయ మాధుర్య మెఱిఁగిన ప్రణయజీవి
పాడులోకమ్ముఁ గాంచదు ప్రణయ మనిన
నమల మద్వైత భావమ్మెయగును; తాయి
ప్రళయమరయు మాటల బాట పలుకవలదు.
మాసములు నాల్గు నందొక్క మాసమరిగె
నారు పక్షాలు కలవింక నంచుఁ గనుల
నీరు నిండఁగ నిట్టూర్చి నిలిచి నాదు
రాకకై జూచు ప్రియురాల! నీకుశుభము.
చైత్రరథ, నందనమ్ములు సాటిరాని
యీ మహారాష్ట్ర యారామసీమ వికచ
పరిమళోదార పుష్పమంజరులు వెలయు
నందు మన్మనోహరమైన యలరు కలదె?

# భావతరంగిణి   

"ఎదటివాణ్ణి చంపకుండా తాను చనిపోగల ధైర్యం మా ప్రజల మనస్సుల్లో నేను పాదుకొల్ప గలిగినట్లయితే, హింసతో పనిలేకుండా మా దేశస్వాతంత్ర్యాన్ని మేం గడించటమే కాక, ఇటుపైన యుద్ధాలు చేయవలసిన అవసరం లేని తరణోపాయాన్ని ప్రపంచానికి చూపెట్టగలుగుతాము."

—మహాత్మ గాంధి

◆ ◆ ◆ ◆

"భారత రమణీమణి గృహనిర్వహణము, లలితకళాది సముపార్జనము మొదలైన వాటిల్లోనే ప్రొద్దు పుచ్చకుండా అవసరమైనప్పుడు రాజ్యాంగ పరిపాలనాదక్షతయందు సహా దీక్షాయత్తయై వుండాలి. ఇది మగువల మానస వికాసానికేకాక దేశ వికాసానికి కూడా దోహదమిస్తుంది."

—కె. రామసుబ్బమ్మ

◆ ◆ ◆ ◆

"భారతమాత శరీరంలోనుంచి ఆత్మ ఇంకా వెళ్లిపోలేదు. భారతమాత సజీవంగానే ఉంది; అని ప్రారంభమైన సత్యాగ్రహంవల్ల మళ్లీ స్పష్టమైంది. స్వరాజ్య తపోవనంలో హోమకుండంలో అగ్నిని ప్రతిష్ఠించారు. వీతిహోత్రుడు జ్వాలామాలాలంకృతుడై ప్రకాశిస్తున్నాడు. ఈ సవనాగ్ని స్వరాజ్యం వచ్చే వరకు అవిచ్ఛిన్నంగా ప్రజ్వరిల్లుతూనే ఉంటుంది."

—భూలాభాయి దేశాయి

◆ ◆ ◆ ◆

"అనుక్షణము మారుచున్న ప్రపంచములో స్త్రీలు గృహారాణులై మతములను, విజ్ఞానములను రక్షించడమే క్షేమకరము. అవసరమువల్ల స్త్రీలు ఏ ఉద్యోగాలకు పోయినను ఇల్లు దిద్దుకొనుటయే తమ ముఖ్యవిధియను సంగతి మరువరాదు. ఎప్పుడూ యింటినే కనిపెట్టుకొని ఉండు పద్ధతిని విసిగికొనుచు ఆందోళనచేయువారు కొంత మెత్తపడి యీ అంశమును గమనించడం మంచిది."

—బేగం మెహిదియార్ జంగు

◆ ◆ ◆ ◆

"ఏ రంగమునందు స్త్రీలు ప్రవేశించిననూ, గృహరంగమువారి సొత్తే. ఇతర మార్గముల దేశసేవ చేసిననూ గృహిణిలుగను, తల్లులుగను, గృహపాలనము, బిడ్డలపెంపును వారు చేయవలసినదే. మన పిల్లల విద్యావ్యవస్థయందు యీ సంగతిని మరువరాదు. వీటియందు ప్రవీణులైన వారికే పట్టమునిచ్చు ఏర్పాటుగూడ నుండవలెను."

—న్యా॥ వెంకటరమణరావు

◆ ◆ ◆ ◆

"శిశువు మాటిమాటికి ఆహారమునకై గోలపెట్టుచుండును. తల్లిదండ్రులు శిశువు గోలపెట్టుచున్న దని దానికి కావలసిన ఆహార మొసంగి పెంచవలసియున్నది. శిశువు పెద్దదైనప్పుడు స్వహస్తములపై నాధార పడును. బాల్యమునందున్న ఆంధ్రవిశ్వవిద్యాలయము వారి కోర్కెల విషయమై మీరు దురభిప్రాయ పడకుందురుగాక...... ఆంధ్ర విశ్వవిద్యాలయాభివృద్ధి నాకు ప్రియతమమైనది. ప్రాణతుల్యమైనది. నేను దీనికొరకే జీవించియున్నాను."

—డా॥ కట్టమంచి రామలింగారెడ్డి



నెల్లూరులో ఆంధ్రరాష్ట్ర హరిజనసేవక సంఘమువారిచే నడుపబడుచున్న
వసతిగృహమందలి బాలికలు

# ★ గర్భిణి స్త్రీల జాగ్రత ★

——"సత్యంవద"——

అమ్మకు నమస్కారములు

నీవు వ్రాసిన వుత్తరం అందింది. నాకు గర్భిణీ అని తెలిసి నీవు కంగారుపడుతూ నాన్నగారిని పంపుతాననాన్నావు. అక్కడకువస్తే మీరు సర్గ్గా ఆరోగ్యపద్ధతుల ననుసరించి పురుడుపోయరు. ఇక్కడ నేను మొన్ననే జరిగిన ఆరోగ్యవారంలో చూశాను. నిజంగా ఆ పురిటిగదికి రెండుకిటికీలూ, రెండు ద్వారాలూ ఉండాలి. బాగా పరిశుభ్రమైనగాలీ, చక్కని వెలుతురూ లోపలికి వస్తోవుండాలి. తల్లికో మంచం, పిల్లకో వుయ్యాలమంచం; బాలెంతరాలు బయటికివస్తే వెళ్లుటకూ, మొఖం కడుక్కొనుటకూ పింగాణీతొట్టె; పిల్ల వాడికి నీళ్లు పోయడానికి ఒకపెద్దతొట్టె; ఆముదం, నూనీ వగైరాలు ఒక పరిశుభ్రమైన స్థలంలో ఉంచడం— ఇవన్నీచూస్తే నాకు చాలా ఆశ్చర్యంవేసింది. మనవాళ్లు యింటి మధ్యలోనూ, కిటికీలులేకుండా ఉండే గదిలోనూ, చీకటిగా ఉండేచోటనూ పురుడుపోస్తారు. ఆగదిని అదివరకు ఏకొట్టుగదివలెనో ఉపయోగిస్తో వుంటారు. ఒకటే నులకమంచం, తాత ముత్తాతలనాటిది. సాంప్రదాయసిద్ధమైనదని ఎప్పుడో మూటకట్టి వుంచిన పాతగుడలు పక్కవెయ్యడానికి వుపయోగించడం. మండు వేసవి కాలమయినా కుంపటి తప్పదు. కుళ్లు బట్టలతోటీ, కుళ్లు చేతులతోటీ ఏమీతెలవని పల్లెటూరు మంత్రసాని యొక్కసేవ. ఇవన్నీ యెంతో అసహ్యంగా తోస్తున్నాయి నాకు.

అయ్యో, క్రితంమాటు చేతులారా పిల్లను చంపుకున్నాము అని అనిపించుతోందికూడా నాకు. ఎందు చేతంటే, పిల్లల మరణ సంఖ్య మన దేశంలో ఉన్నంత యింకెక్కడా లేదు. దీనికి ముఖ్యకారణం చక్కని ఆరోగ్య పద్ధతులతో పురుడు పోసుకొనుట తెలియక పోవడమే. ఇతర దేశాలలోనూ, ఆరోగ్య పద్ధతులు తెలిసిన చోట్ల మనదేశంలోకూడానూ, పుట్టిన పిల్లలు చక్కగా గుమ్మటాల్లాగ పెరిగి ముద్దువస్తూవుంటారు. ఇల్లాగంటే, "ఆ? మన లోపమేముంది. వాళ్ల కర్మం అల్లా కాలింది. ఉప్పరాళ్ల పిల్లలకు ఏమి ఆరోగ్య పద్ధతులు జరుగుతాయి. వాళ్లు రాళ్లల్లాపుట్టి పెరగడంలేదా?" అని మీరందరూ నోరు చప్పరిస్తారు. కాని అది నీరసస్థుల వేదాంతం తప్ప, ధైర్య వంతుల కార్య శూరత్వంకాదు. అందుచేత ఆ మాటలలో ఏమంత అర్థం వుందనుకోను నేను.

ఈ విశాఖపట్నం పెద్దాసుపత్రిలో పురుళ్లు చూస్తే నాకు చాలా ఆనందంగా ఉంటుంది. చూడు, ఇక్కడ ఏ 'యెన్నెమ్మ' వచ్చింది? అన్ని కిటికీలూ తెరిచి వున్నాయి. ఆ సముద్రం మీదనుంచి వచ్చేచల్లని గాలిలోని ప్రతీ అణువూ ఈ బిడ్డలకూ తల్లులకూ యినుమడించే ప్రాణశక్తి నిస్తుంది. 'యెన్నెమ్మ' వచ్చి యీ పిల్లల గొంతుక నొక్కలేదే! మీరు అన్ని తలుపులూ వేసి వుంచినా కాని, అప్పుడు నా పసిపిల్లకు ఎందుకు సంధికొట్టింది? ఆరోగ్యంగా గది వుండకపోతేనే అల్లాంటివి సంభవిస్తాయి. నిక్షేపంలాటి బిడ్డలు నోరూ వాయీ లేకుండా నశిస్తారు. తల్లులుకూడా క్రూర రోగాలపాలవుతారు.

పైగా, పురిటి గదిలోకి ఎక్కువగాలి వస్తే, బాలెంతరాలికి వాతం చేస్తుందంటారు. ఇది ఎప్పటికీ నిజంకాదు. ఎంచేతంటే శరీరానికి పరిశుభ్రమైన గాలి నిరంతరం అవసరం; అనారోగ్యంగా వుండేవారికి మరీ అవసరం. ఏ వర్షాకాలంలోనైనా, చలికాలంలోనైనా ఎక్కువ చలిగాలి వస్తుందని తోస్తే బాలెంతరాలి దుస్తులలో మార్పుచేసి, ఆమె శరీరమును వెచ్చగా ఉండేటట్టు చెయ్యాలి. అంతేకాని అసలు గాలినే 'రావద్దు, పొమ్మ' ని తోసెయ్యకూడదు.

బాలెంతరాలంటే ఆపరేషను చేయించుకొన్న రోగి కంటె ప్రమాదకర మైన పరిస్థితిలో పచ్చిగా ఉన్న రోగి అన్నమాట. ఆపరేషను చేసిన వారికి ఎక్కడ పుండు ఉంటుందో అక్కడే పచ్చిగా ఉంటుంది కాని, బాలింతరాలికి ప్రతీ అంగం పుండై బహు ప్రమాదకరమైన పరిస్థితిలో ఉంటుంది.

ఇంకో విషయం; పురుడంటే ఒక ముట్టువంటిదని మీ ఊహ. పురిటింట్లోకి ముట్టువాళ్లూ, మైల వాళ్లూ తండోపతండాలుగావచ్చి చూసి పోతూవుంటారు. ఇదెంత అనారోగ్యమో తెలుసా? అసలు బాలెంత రాలిని ఒక మడితో ఉన్న స్త్రీని చూచినట్లు చూడాలి. మనమడి అంతా ఆరోగ్యము కొరకే కనుక.

బిడ్డ గొడవ సరిగ్గా చూడరు. పుట్టగానే బోరిక్ పౌడరుతో కళ్లుకడిగితే కళ్లకేమీ ప్రమాదం ఉండదు. ఇల్లా చెయ్యకపోవడం వల్లనే బిడ్డలు పుట్టు గ్రుడ్డివాళ్లవుతో వుంటారు. దీనికిమీరు కర్మ సిద్ధాంతంతో కారణాలు చెప్పి సరిపెట్టుకుంటారు. నేననేదేమిటంటే 'ఈ మంచిపని కాస్తా చేశాక 'కర్మం' అని అనుకోరాదా అని' బొడ్డుకోసే కత్తినికూడా మీరుశుభ్రంగా ఉంచరు. ఒక కత్తెరను కాగే నీళ్లలోవుంచి, బొడ్డుకోసే సమయాన్ని దాన్నితీసి వుపయోగించాలిట. బొడ్డుకు కట్టే తాడు కూడా మరిగే నీళ్లలోనే ఉంచాలి

ఇల్లాంటివన్ని తలచుకుంటే మంచి పరిస్థితు లేర్పడే వరకూ అక్కడకు వచ్చి పురుడు పోసుకోడానికి నాకు మనస్కరించడంలేదు. అందుచేత మీరు నేను చెప్పినప్రకారం ఆరోగ్యమైన పద్ధతులలో పురుడు పోస్తానంటే అక్కడకు వస్తాను. లేకపోతే ఇక్కడనే పెద్ద ఆసుపత్రిలో క్షేమంగా పురుడు పోయించుకొంటాను. ఇల్లా వ్రాశానని కోపంవద్దు. ఇంట్లోపనులు చేసుకుంటున్నాను. కులాసాగా వున్నాము.

## స్వాగతము

శ్రీమతి పట్టికొండ విశాలాక్షి

కవిగేయముల్ వినుచు
కవిపద్దెముల్ వినుచు
కవి జీవితేశ్వరిగ
కలకాలముండుచూ
కవయిత్రి మాటయే మరచావా?
కవి కవుంగిలి లీనమైనావా?
ఆలింగనము వీడి రాలేవా?
అచటనే సుఖయింప జూచావా?

తేట తేనియకన్న
తీయందనము గల్లు
కవి కల్పితంబైన
కవితామృతంబిచ్చి
తనవశమ్మొనరించు కొన్నాడా!
తనకు తానే మురియుచున్నాడా!
స్త్రీలకడ కేగవలదన్నాడా!
చెంతనే కూర్చుండు మన్నాడా!

కవిబోధలే వినుచు
కవి పక్షపాతివై
స్త్రీవయ్యునున్ మాదు
చెంతకే రాకుండ
అచటనే వసియింప దలచావా?
అదియె నీ ధర్మమని యెంచావా?
స్త్రీ కులోద్ధరణకైనను రావా?
స్త్రీలన్న అభిమానమే లేదా?

పరమాద్భుతంబైన
ప్రకృతి వైచిత్ర్యముల్
దర్శింప జేసినిన్
ధన్యురాలిగ జేతు
వేగమేరావమ్మ, ఓ కవితా!
స్వాగతంబిస్తాము మృదుకవితా!
నీరాజనంబిదుగో, ఓ కవితా!
నిన్నెపూజిస్తాము నవకవితా!

బహుభార్యాత్వాన్ని పూర్తిగా
తరిమివేయాలని పట్టుపట్టింది

# ★ సుశీలకు నా ధన్యవాదాలు

—బూ. రం. రావు బి. ఏ.—

మానవ జీవితం ఒక రైలు ప్రయాణంలాంటిది; అందులో ముఖ్యంగా దాంపత్య జీవితం. ఈ పందొమ్మిది శతాబ్దాల నడుమ కూడా, హిందూ సమాజంలో ఇంకా అకస్మికమైన, నిర్హేతుకమైన వివాహాలు జరుగుతున్నాయి. శుభాంతంగా పరిణమించేవి చాలా అరుదు. అంతం ఎలాగున్నా బ్రతికి ఉన్నన్ని రోజులు భార్యాభర్తలు అనుకూలంగా గడపడంకూడా గొప్ప భాగ్యమే. అసమ వివాహాలు ఒక్కొక్కప్పుడు అసమంగానే ఉంటాయి. కొన్ని దారుణంగా పరిణమిస్తాయి...

మా దాంపత్యంకూడా దారుణం కాకపోయినా అనుచితమైంది. ప్రభ రూపసి. స్కూల్ ఫైనల్ ప్యాసయింది. నామీద ప్రేమలేదని చెప్పటానికి వీలులేదు. ముఖంమీద ఎప్పుడూ అజ్ఞానం కనపడుతూ ఉంటుంది. పల్లెతనం తాండవిస్తూ ఉంటుంది. వయసు పద్ధెనిమిదేండ్లు. పొట్టిగా బక్కగా ఉంటుంది. నాకూ మొదట ప్రభమీద వ్యామోహం ఉంది చెప్పొద్దూ,...కాని......

మొట్టమొదట ప్రభ ముఖంమీద కనుపడిన అజ్ఞానం ఇప్పుడు మూర్ఖత్వంగా మారింది నాకళ్లకు. ఆమె మితభాషణ, శుశ్రూష, నామీది భక్తిశ్రద్ధలు, ప్రేమ మొదట ప్రణయోన్మత్తుణ్ణి చేసేవి. ఇప్పుడు ఉన్మాదుణ్ణిగా చేస్తున్నాయి.

ఎంత చదువుకున్నా అదేమిటో ఆమెలో మూర్ఖత్వం మూర్తీభవించింది. ఆ ఎఱ్ఱని పెదిమలలో ఆనందం కనబడదు. తీర్చిన కనుబొమ్మల్లో, విశాల నేత్రాల్లో ఆకర్షణశక్తిలేదు. ఇప్పటికీ ఆమెను ఎంతో మంది అందగత్తె అంటారు. నేను అదృష్టవంతుణ్ణని కొందరు 'చాటుకూ నేటుకూ' అసూయపడతారు. నా అసంతృప్తి వాళ్లకి తెలిస్తేగా!

బెంగాలీవాళ్లను, హైందవసభ్యతా స్వీకృతులైన ఆంగ్లో ఇండియన్లను, పార్సీ పడుచువాళ్లను చూస్తే నాహృదయం తరుక్కుపొయ్యేది. పొడుగ్గా, సన్నంగా, నాజుగ్గా పాలప్రవాహాల్లాంటి చేతులు, చాక చక్యాన్నంతా ప్రతిఫలింపజేసే వాళ్లకళ్లు చూస్తే నా గుండెలవిసిపొయ్యేవి... 'నాకీ నిర్భాగ్యదేవత ఎందుకు లభించిందా? ఎంత పాపంచేశానో' అనిపించేది. ఇంక ఇతరకారణా లేవీలేవు. ప్రభ పొడుగ్గా లేక పోవడం, ఉత్సాహంగా ఒత్తుకు తిరగడం (pushing nature) చాతగాకపోవడమే నా కామెమీద అయిష్టం కలిగించాయి. ఆ అయిష్టాన్ని నెమరువేసి నెమరువేసి...అసహ్యాంకిందికి దిగింది. ఎలా ప్రభను వదిలించుకోవడం? ఎలా ఆమెమీద, ఆమె వాళ్ళమీద నాపగ తీర్చుకోవడం?...పునర్వివాహానికి పూనుకోవటం అతి సులంభం, అత్యుత్తమంగా తోచింది...

పునర్వివాహ ప్రయత్నం చేశాను. చాలామంది తమ అమ్మాయిలను ఇస్తామన్నారు. కాని 'తుంటెవిడిచి మొద్దును కట్టుకోగూడద'ని, నా ఆశయాలప్రకారం తగిన వధువు కష్టంమీద దొరికింది. ఇంగ్లీషుమాత్రం రాదు. అందంగా పొడుగ్గా చాలాకీగానే ఉన్నది. సంగీతం బాగావచ్చు. ఆ అమ్మాయికి పన్నెండేళ్ళకే తెలుగులో మంచి పాండిత్యం వచ్చిందంటే ఇహ ఇంగ్లీషు ఒక సంవత్సరంలో బాహాటంగా నేర్పుకోవచ్చునుకుని ఆమెను పెళ్లిచేసేసుకున్నాను.

ఎలాగైతేనేం సుశీల మా ఇంటి కొచ్చేసింది.........ఓపికతో నాలుగేళ్లు పట్నంలో మహిళా విద్యాలయంలో వుంచి చదువుచెప్పించాను. ఈ నాలుగేళ్లలో సుశీల బాగా ఇంగ్లీషు నేర్చుకుంది. నా అదృష్టవశాత్తు పాశ్చాత్య దుర్గుణాలామెకు అలవాటుపడలేదు. సత్సాంగత్యంవల్ల ఇంగ్లీషు చదువుకున్న ఆమెదృష్టి విశాలమైపోయింది. సంఘసంస్కరణమీద ఆమెహృదయం లగ్నమైంది. స్త్రీ జనాభ్యుదయం కోసం ఆమె సర్వశక్తులూ ప్రవాహాలవలె పొంగి పొయ్యాయి. శ్రీమతులు సరోజినినాయుడు, కమలా నేహ్రూ, విజయలక్ష్మీపండిట్, దుర్గాబాయమ్మ ఆత్మతేజ మీామెలోగూడా ప్రకాశించిది.

అందం, జాగ్రత్త, తెలివితేటలూ, అన్నీ నాకుకావలసినవే దొరికాయి-కాని నాకు శాంతిలేదు. తృప్తిలేదు. కారణం? నేను ముఖ్యంగా నా మనస్ఫూర్తిగాకోరింది - నిజంచెప్పవలసివస్తే - ఇంగ్లీషు విద్యవల్ల వచ్చే నాగరికత, ఫాషన్, ఒత్తుకు తిరగడం, నిర్లక్ష్యం, ఒకముక్కలో పాశ్చాత్య వ్యామోహం... నాకు కావలసిఉంది. సభలో ఉపన్యాసాలివ్వడమే గాని తత్ప్రకారంచేశామనే పట్టుదలగాదు. ఇలాగే అంతే. (Shyprocrisy, Superficiality Vanity) చెప్పేదొకటి చేసేదొకటి, బుడబుడక్కల వేషాలు, స్వాతిశయం...ఇలాంటివి. ఈ దుర్గుణ పుంజాన్ని కడుపునపెట్టుకొ, మీదికిమాత్రం టాయెలెటు వాసనలు ఘుమఘుమా యిస్తుంటే, పెదవులమీదలేని చిరునవ్వు తొణుకాడు తూండగా గోముఖవ్యాఘ్రంవలె ఉండాలని... ఇలాటివి ప్రభలోలేవనే, సుశీలను చేసుకున్నాను ...

కాని సుశీల సుశీలయే అయ్యింది. ఎంత ఆధునిక సభ్యతా సంపర్కమున్నా ఆమెమాత్రం క్రియలో, అనుష్ఠానంలో నిజంగా హైందవనారీమతల్లుల పవిత్రాత్మశక్తిని జొప్పించింది. ఈ శక్తి ఏకముఖమై ప్రప్రథమంలో నామైన్నే ప్రయోగించింది. నేను తననెందుకు పెళ్లాడానో తెలుసుకుంది. నా అవివేకానికి నొచ్చుకుంది. బహుభార్యాత్వము మొదట తన ఇంటినుండి తరిమవేసి తరువాత పొరుగిళ్లనుండి, దేశాన్నుంచి తరిమేయాలని పట్టుపట్టింది.

శలవులిచ్చారు. మా ఇంటికివచ్చింది సుశీల. మా ఇంట్లో నేనూ ప్రభ ఉన్నాం. సుశీల తీరాచదువై వచ్చిందాకా ప్రభతో ఉండి తరువాత ఆమెను పంపివెయ్యాలను కున్నాను.......సుశీలకు ఎప్పుడెలా మాట్లాడాలో బాగాతెలుసు. అంచేత ఒకరోజు అవకాశంచూసి, ఉన్నట్టు ఉండే 'మీరు మాఇద్దర్లో ఎవ్వరినో ఒక్కర్నిమాత్రమే పెళ్లాడాలె. అన్నివిధాలా మీకు ప్రభే తగింది. మొదలు ఆమెను పెళ్లిచేసుకున్నారు. ఇప్పుడామెనే ఉంటే బావుంటుంది. కచ్చితంగా చెప్పండి' అంది రోషం కళ్లలో ప్రతిఫలిస్తూండగా. నేను నిలువునా నీరైపోయాను. వెంటనే అందుకున్నది 'మీకు ప్రభ ఇష్టంలేకపోతే, ఆమెకునేను పునర్వివాహం చేస్తాను. ప్రభ ఒప్పుకుంది'. చాటున ప్రభకు ఏం చెప్పి వప్పించిందో ఇద్దరు ఏం మాట్లాడుకున్నారో? ప్రభకోసం సుశీల తాను త్యాగంచేయాలనుకుంది. ప్రభను నాకు విడిచిపెడ్తే దౌర్జన్యంచేసి ఆమెమీద ఈపగ ఆపగ సాధిస్తానని తానే నన్ను పెళ్లాడవప్పుకున్నది. మన సంఘంలోని దురాచారాలను గురించి, నాలాటి స్వార్థపరుల గూర్చి ఒకపెద్ద ఉపన్యాసం విసిరింది ఎంతో చాకచక్యంతో, ఉద్రేకంతో. నా కళ్లలోనుంచి పటపట నీళ్లు దూకాయి. అజ్ఞాన తమోజీమూతాలు పటాపంచలయ్యాయి. ఆ పశ్చాత్తాపపు అశ్రుపాతంతో నా వ్యామోహం, నా మూఢ్యం, నా పాపం అంతా, సుశీల పవిత్ర తేజంలో దగ్ధమైపోయాయి. సుశీలకు నేను తగకపోగా ఆమెనాకు దేవతలా కనపడింది. ఇహ ఆమెతో దాంపత్యంపొసగదు. ప్రభ అనుమతిమీద, నేను ప్రభనే ఇప్పుడు పవిత్రవివాహం చేసుకున్నాను. •

సుశీలకు నా మనః పూర్వకమైన ధన్యవాదాలు.

# స్త్రీ అబలయా? మహాబలయా?

ఏదేశమైనను పాలకులయొక్క ఆదర్శములపైన, వాటి నాచరణయందు పెట్టు విధానముపైనను ఆధారపడి అభివృద్ధి జెందును. ఈ నియంతల నీతుల పరికింపుడు —

" నాజీసిద్ధాంతము ప్రకారము స్త్రీలు, భార్యలుగను, తల్లులుగను తయారై యుండవలెను. కాన వారికి గృహకార్యనిర్వహణమందు మాత్రమే తగు తరిబీయతు నీయవలెను. "

—హిట్లరు.

" ఆకర్షణీయముగ నుండి, పిల్లలను గనుటయే స్త్రీల పని. ఇప్పటివారనుకొనునంతటి మొరటుగాను, పురాతనాచారముగా నుండదది. ఆడుపిట్టలు మగవాటికొఱకు తయారుగానుండి గ్రుడ్లనుపొదిగి పెట్టును. అందుకు ప్రతిఫలముగ మగపక్షులు వాటిని శత్రువుల నుండి రక్షించును. "

—జోసెఫ్ గోయబిల్సు,

" భగవంతుడు స్త్రీని ప్రేమకొఱకును యింటి చాకిరీ చేయుటకును సృష్టించి యున్నాడు. "

—బవేరియన్ నాజీ మెంబరు.

" ప్రభుత్వములోనూ, పరిపాలనలోనూ గూడ పురుషులకువలెనే స్త్రీలకును సమానముగ హక్కులుండితీరవలెను. వంటచేతనైనవారికందఱకును, పరిపాలించుటగూడ దెలిసియుండవలెను. కోట్లకొలదిగానున్న స్త్రీలను మినహాయించుచో, మనము కార్మిక కర్షకవర్గముయొక్కయు, సామ్యవాదముయొక్కయు నియంతృత్వమును బడయజాలము.

స్త్రీలు కుటుంబజీవనమనుపేర, వేయివిధములుగా బలియీయబడుచున్నారు. ఈ పురాతన కుటుంబ పద్ధతితో అంతర్లీనమైన పురుషుడే యధికుడను అభిప్రాయమే బలీయమొనర్ప బడుచున్నది. స్త్రీలలో, మనము చేయు రాజకీయప్రచారమును, పురుషులకు తగు విజ్ఞానమొసంగుటతో, స్త్రీల హక్కును గుర్తించుటకై మేళవింపవలెను. మన పార్టీయందును, కార్మిక కర్షక వర్గములందునుగూడ పురుషుడే ప్రభువును, యజమానియు నను భావము కూకటివ్రేళ్లతో పెల్లగించవలెను. "

—లెనిన్.

" ఆర్థికముగను, రాజకీయముగను, భౌతికముగను, ఆధ్యాత్మికముగను అవి యివి అననేల అన్ని విషయములందును పురుషునకు స్త్రీ అత్యంత సహాయకారిగ నుండవలయును. "

—స్టాలిన్.

" స్త్రీలుగూడ, సంపూర్ణ స్వాతంత్ర్యము నాదర్శముగాగొని తమ, మన, దాశ్యవిముక్తికై విశాలదృష్టి గలిగి పాటుబడుట వాంఛనీయము. "

—జవహార్‌లాల్ నెహ్రూ.

ఆయాదేశముల ప్రస్తుతాభివృద్ధిని గాంచినచో ఇందేది ఆచరణీయమో సులభగ్రాహ్యమగును. రష్యా స్త్రీలు నేడు ఉన్నతినందిరనిన వారి యాదర్శములే కారణము కాదా?

—శ్రీ తోట లక్ష్మయ్య.

# అత్తాకోడళ్ల కలహాలు

(సైకాలజీననుసరించిన కొన్ని కారణాలు)

అత్తలకు నీతులైనా
కోడళ్లకు కూడా
అన్వయిస్తాయి.

ఇనప్పెట్టె తాళం అత్తగారికే యివ్వాలి; ప్రతి స్వల్ప విషయానికీ, అత్తగార్ల సలహా పుచ్చుకోవాలి. తమకింట్లో ప్రాముఖ్యత లేనట్లు నటించాలి. నటిస్తేచాలు, నిజంగా ప్రాముఖ్యత వాళ్లే వుంచుకున్నా. సంసారంలో చాలావరకు నటన అవసరం; అని.

— శ్రీయుత —
శివరాజు వేంకటసుబ్బారావు,
ఎం. ఏ. (బుచ్చిబాబు)

అత్తాకోడళ్ల కలహాలకి కారణం యేమిటి? ఈ ప్రశ్న అందర్నీ యెప్పుడో అప్పుడు బాధించితీరుతుంది. ఆలోచిస్తే పైకి కనిపించే కారణాలు ప్రతివాడికీ తెలుస్తూనే వుంటాయి—స్త్రీలు చదువుకోక పోవడంవల్ల అని. చదువుకోవడగానే, క్రొత్త అభిరుచులు, నూత్న భావాలు హృదయాన్ని వంటింటినుంచి మరల్చి, విశాలపరుస్తాయని దీని తాత్పర్యం. ఇక్కడ మరో ప్రశ్న ఎదుర్కొంటుంది. చదువంటే ఇంగ్లీషు చదువా? ఇంగ్లీషైతే కాలేజీలకెళ్లాలా? గృహాన్నిగురించిన శాస్త్రం తెలుసుకుంటే చాలునని కొందరి మతం. కుట్టుపని, అల్లిక, పిల్లలపోషణ, ఇంటి అలంకారం, వ్యవహారాల్లో భర్తకు సహాయపడేటందుకు సరిపడ్డ లోకజ్ఞానం. యిది Domestic Science.

రెండోరకం, ఇంగ్లీషు చదవాలనీ; పత్రికలు, గ్రంథాలుచదివి కొత్త విషయాలు తెలుసుకుని, లోక విజ్ఞానానికి తోడ్పడాలనీ; ఇవిరెండు భర్తయిష్టాయిష్టాలమీద, ఆధారపడి వుంటాయి.

కాని కోడళ్లు చదువుకున్నంత మాత్రాన, కలహాలు తగ్గుతాయనుకోవడం వెర్రి. అత్తాకోడళ్లలో వొకరుమాత్రం చదువుకున్నవారైతే, కలహాలు మరింత ఎక్కువవుతాయని వేరే చెప్పక్కర్లేదు. పోనీ యిద్దరూ చదువుకున్నవాళ్లే ఐతే? చెప్పలేం. కాని యిట్లాంటి కలయిక బహుఅరుదు. అందరూ చదువుకున్న గృహాలలోకూడా అత్తాకోడళ్ల కలహాలు యింకా సాగుతూవుండడంవల్ల, వీటికి ముఖ్యకారణం, పాశ్చాత్యవిద్య లేక కాదని తేలుతుంది.

వీటికి కొన్ని మానసిక కారణాలున్నాయని నా నమ్మకం. వీటినిపూర్తిగా రూపుమాపలేక పోయినా, వీటి తీవ్రత తగ్గించే అవకాశాలు స్త్రీల సైకాలజీ తెలుసుకున్నవాళ్లు కల్పించగలరనీ నమ్ముతూ, కొన్ని సైకాలజీ సిద్ధాంతాలు యిక్కడ క్లుప్తంగా వ్రాస్తున్నా.

ఆధునిక శాస్త్రాలలో సైకాలజీ చాలావున్నత స్థానం ఆక్రమిస్తుంది. ఈశాస్త్రానికి పితామహుడు సిగ్మండ్ ఫ్రాయిడ్. (Sigmund Freud.)

కలహ కారణాలని విమర్శించేముందు, మొదట్లో కొన్ని వూహించుకోవాలి. మొదటిది, చాలా కలహాలు అత్తల మూలంగానే నని. అత్తలు రెండురకాలు. భర్తలుకలవాళ్లు, విధవలు. ఈ యిద్దరి

లోనూ భర్తలుకలవాళ్లే, చులకనగానూ, బలంగానూ దెబ్బలాడగలరు. కోడలు కాపరానికి రాగానే, వీళ్లు తమకి తెలియకుండానే, అసూయా భావంవల్ల బాధపడతారు. ఈ అసూయ పైకి కనిపించదు. పైపెచ్చు, అపారమైన ప్రేమగా కూడా పరిణమించొచ్చు. అసహజమైన ప్రేమకూడా ప్రమాదకరమైందే.

> 'సైకాలజీ'కి సంబంధించిన హంశాలు సమాజానికి కావలసిన సమయమిది. రచయిత పరిశ్రమలో రమణీలోక రత్నాలు పండించాలి.

ఉదహారణకు—దార్లో పోయే బట్టలవాణ్ణి అత్తగారు కేకేస్తుంది, కోడలికి చీరకొంటానని. లోపల తనే చీర కొనుక్కోవాలనుంటుంది; ఇది కనిపించని వాంఛ (Unconscious desire) కోడలి-చీరకోసం కేకేసింది. తీరా బట్టలవాడు రాగానే, "నీకు చీర కావాలా?" అని ఆ కోడల్ని అడగడం యెందుకు? కొడుకు భార్యకి యేమన్నా తీసుకొస్తే, తనకికూడా తేలేదని భర్తతోతగవు; కొడుకుమీదకోపం. కోడలు యవ్వనంలోవుంది. తను అనుభవించలేని వెన్నెల, సౌందర్యం, శృంగారం, యీ కొత్తపిల్ల అనుభవిస్తోందే! ఇవన్నీ కూతురనుభవిస్తే కోపంవుండదు. కారణం? కూతురనుభవిస్తే తననుభవించినట్లే. ఫ్రాయిడ్ సిద్ధాంతాలప్రకారం, యీఅసూయకి కారణం, బాల్యంలోనూ, యవ్వనంలోనూ, తీరని వాంఛలని తేల్తుంది. అత్త, తన యవ్వనం, అత్తారింట్లో గడపడం మూలాన, తనుస్వేచ్ఛగా, మానసికంగానూ, భౌతికంగానూ అనుభవించే అవకాశాలులేక పొయ్యాయి. తను దాక్షిణ్యంచేసి, యెదిరించి, కోరినవాటిని పొందలేక పొయ్యింది. నీతి, కుటుంబ గౌరవం, వంశమర్యాద, లాకొట్టులు, తనవిరుద్ధ విప్లవభావాలను అణిచి, నొక్కిపెట్టినవి. కాని, ఆవాంఛలన్నీ పూర్తిగా నశింపుకావు. అవి తాత్కాలికంగా అణిగివున్నా, యెంత తీవ్రంగా అణిచిపెడితే, అంతతీవ్రంగానూ కొంతకాలానికి బైటపడి, చెలరేగుతాయి. నిద్రసమయంలో, పై చెప్పిన ఆటంకాలు లేకపోవడంవల్ల మనస్సు, శరీరం స్వేచ్ఛపొంది, కలలమూలంగా బైటపడతాయి. ఆ కలల్ని శోధిస్తే, వాటిమూలాలు, గడిచిపోయిన యవ్వనంలో బాధించిన తీరని వాంఛలేనని తేల్తుంది. ఫ్రాయిడ్ యింకా ఘోరమైన సంగతులు వ్రాస్తాడు. ప్రతితల్లికి పుత్రుడుమీద కూడా, తెలియని భౌతిక వాంఛవుంటుందట. పుత్రుడికి భార్యరాగానే, అతన్ని తనకులేకుండా పరాయిపిల్ల తనవశం చేసుకుంటుందని, వొక చెప్పరాని అసూయట—దీన్ని ఇడిపస్ కాంప్లెక్స్ అంటాడు. (Oedipus Complex) అందుకనే యీ కోడల్ని హింసించడంలో అంతవుత్సాహం చూపుతుందని తేల్తుంది. అంచేతే, కొడుకు భార్యనికాని, భార్యపుట్టింటార్నికాని దెప్పిపొడుస్తే, అత్తకు ఎంతోసరదా. తిట్టి, హింసించడానికి కోడల్లో యేలోటూ కనిపించకపోతే కోడలి పుట్టింటారిమీద పడడం, మనం చాలామార్లు చూస్తూనేవుంటాం. మళ్లాకోడలేకనక, తన కొడుకుని దెప్పిపొడిస్తే, పరిహాసానికైనాసరే, విరుచుకుపడుతుంది. "మావాడి కాలి గోరుకి పోలవు" అంటుంది. తన కొడుకు యెంతో అవస్థపడి, పెళ్లాన్ని పిల్లల్నిపోషించి కృశించి పోతున్నాడని, దానికంతాకారణం కోడలేనని, పెద్దతెలియని అనుమానం.

రెండోది, తన తీరనివాంఛలను, అణుచుకోడానికి అలవాటుపడినయిల్లాలు, కొత్తకోడలు, అవన్నీ అనుభవించడం చూచేటప్పుడు, తన మనస్సునిజీవితాన్ని తారుమారు చేసుకుంటుంది. సదా ఆచారా

లకిలోంగి, నీతిగా కాలం గడపడానికి అలవాటుపడ్డ అత్తకి, కోడలి అనుభవం అవనీతిగా తోస్తుంది. దీన్ని ఫ్రాయిడ్ స్థిరపడిన ఆంతరంగికం అంటాడు. (Conditioned Reflex) దీనికి మందేమిటంటే, ఆంతరంగికం స్థిరపడకుండా చేసుకోవాలి. కొత్త వ్యక్తులకి గౌరవంయిచ్చి, తన స్వార్థాన్ని నిలబెట్టుకోవాలి. కోడలిస్వార్థాన్ని గుర్తించాలి. కోడలు అత్తగారిస్వార్థాన్ని పొగడుతూ, దాన్ని అమలులోపెట్టే యత్నాలు చెయ్యాలి.

"ఇంతప్రొద్దెక్కా పక్కమీంచిలేవడం?" అంటుందనుకోండి అత్తగారు.

"అబ్బే లేదండి - ఒళ్లు నెప్పులుగావుందండి—మీరుకూడా అంత తెల్లారగట్ల లేవడంమూలాన్నే, మీకా మెడనెప్పులు..." అని సమాధానంచెప్పాలి. ఈ స్వార్థాన్ని, తీరని వాంఛలనీ, మెల్లగా బైటపడేటట్లు చెయ్యాలి, కొడుకు కోడలూకలిసి.

"మేం సినిమాకు వెడుతున్నాం,"

"వెళ్ళండి, నేరాను" అత్తగారంటుంది.

"మీరు రాకపోతే నేవెళ్లను - మీరుంటేనే సరదా" అనాలి. అల్లాఅని, అత్తగార్ని తీసుకెళ్లకపోయినా యేమీ అనుకోదు.

ఈ పైచెప్పిన సిద్ధాంతాలన్నీ, భర్తలున్న అత్తగార్లకే కాకుండా, భర్తలు పోయినవాళ్ళకుకూడా చాలాభాగం అనువర్తిస్తాయి. సైకాలజీలో, ఫ్రాయిడ్ తరవాత పెద్దచెయ్యి, ఆల్ఫ్రెడ్ ఆడ్లర్ (Alfred Adler) ఇతని సిద్ధాంతాలు, విధవ అత్తగార్లకు అన్వయిస్తాయని తలుస్తా కాబట్టి, అవిక్కడ పొందుపరుస్తా.

ఈయనప్రకారం, పురుషులకేకాకుండా, స్త్రీలకికూడా 'అధికారం'మీద మోజు చాలా వుంటుందని. పురుషుడికి, యితరులమీద 'అధికారం' చెలాయించాలని వుండడమే వాళ్లుచేసే యత్నాలకి, కార్యాలకీ కారణం అని తేల్తుంది. కథలువ్రాసినా, ఉద్యోగంచేసినా, నటించినా, సంగీతంపాడినా, ఉపన్యాసాలిచ్చినా, రాజకీయంలోదిగినా, శరీరంపెంచినా—వీటిల్లో యేదిచేసినా, ముఖ్యమైనకోరిక అధికారవాంఛ. చెయ్యలేనివాడు కోతలుకొయ్యడం అందుకే. అదీ చేతకానివాడు, వ్యాధిగ్రస్తుడైనప్పుడు, జబ్బునే ఆధారంగాచేసుకుని, యింట్లో వాళ్ళమీద అధికారం చెలాయిస్తాడు. అంచేతే, "జరుగుబాటుంటే జబ్బంత సుఖంలేద"న్న సామెత.

అల్లాగే స్త్రీలకీ అధికారవాంఛ వుంటుంది. ఆస్తులకు, చదువులు, ఉద్యోగాలు, పోటీపడీ అవకాశాలు లేకపోడంమూలాన, అధికారం యెవ్వరిమీదా చెలాయించలేరు. కొందరు అక్కడికీ తెగించి భర్తమీద అధికారం చెలాయిస్తారు, గయ్యాళీగంపలని పేరుపడ్డాసరే. "లోకం పురుషుడికి చెందుతుంది; కాని, పురుషుడు, స్త్రీకి చెందుతాడు" అంటాడు బొక్కేషియో (Boccaccio) భర్తమీద చెలాయించే అధికారం, పిల్లలు పెద్దవగానే, భర్తమీదినుంచి, పిల్లలమీదకు మరల్తుంది. పిల్లలుకూడా పెద్దవాళ్లయింతర్వాత, వాళ్లమీదకూడా దౌర్జన్యంచేసే అవకాశాలులేక, చివరికి కోడళ్లమీద పడతారు. ఇదీ వాళ్ల సైకాలజీ.

స్త్రీలో సహజవుద్రేకం చాలా తీవ్రంగావుంటుంది. ఆడ్లర్ప్రకారం, వుద్రేకాలన్నింటిలోకీ ప్రధానమైంది అధికారవాంఛ. ఇది బైటపడే అవకాశాలులేక, సమయం చిక్కగానే, భయంకరమైన తీవ్రతతో కోడళ్లమీద చెలరేగుతుంది.

# అత్తాకోడళ్ల కలహాలు

కోడలు హడుల్తోవుండాలి; భార్యని యింకా యెక్కడ హడలకొడుతుందోనని కొడుకుకూడా హడుల్తోవుండాలి; కూతుర్ని యెక్కడ హింసిస్తారోనన్న భయంవల్ల కోడలి పుట్టింటారుకూడా హడుల్తోవుంటారు. బామ్మ, తల్లినేమంటుందోనని భయపడి మనమలు హడుల్తొంటారు. కోడలుంటే అధికారం ఛలాయించేందుకు, అన్ని అవకాశాలున్నాయి అత్తగారికి.

భర్త గతించగానే, విచారంవల్ల మూలపడిన అధికారవాంఛ, కొంతకాలానికి మరీ పేట్రేగిపోతుంది. కొడుకుని కని, పెంచి, పెద్దవాణ్ణి చేసిందికాబట్టి, తనకి అతని నిత్యకృత్యాలలో కలగజేసుకునేందుకు సర్వహక్కులూ వున్నాయనిభ్రాంతి. కేకలెయ్యడానికి భర్త లేకపోవడంవల్ల, విధవ అత్తగార్ల అధికారవాంఛ కోడళ్లమీద మాత్రమేకాకుండా, యిరుగు పొరుగువాళ్ళమీద, కూరలవాళ్ళమీద, నౌకర్లమీద చెలరేగి, అందరి ఆత్మగౌరవాల్ని ధ్వంసంచేసి, తనో చిన్న 'చివర రోజులలోని విక్టోరియా'లాగా, వొక రాజ్యానికి రాణీలాగా ప్రవర్తిస్తుంది.

ఈ వాంచని తగ్గించే మార్గం కనపడదు. పైగా యీవాంఛలు మానవులకి ప్రాకృతికాలు. ఇవి మనుష్యులకు, మృగాలకు, ప్రకృతికివున్న దగ్గిర బంధుత్వం తెల్పుతాయి. వీటిల్లో నైతికంగా ఆక్షేపించవలసిందిలేదు. ఆమాటకొస్తే, స్వార్థాన్ని చంపుకొని, వ్యక్తిత్వాన్ని నిర్మూలంచేసుకుని, సన్యాసిలా జీవించడం, సృష్టికి వ్యతిరేకంగా బ్రతకడం అన్నమాట. కాని, వీల్లు చెయ్యగలిగిందేమిటంటే, యీ అధికారవాంఛ బైటపడేందుకు, నెమ్మదైనమార్గం తెలుసుకోవాలి. అక్కడికి కొందరు విధవత్తగార్లు, దినంలో సగం కాలం బైటికివెళ్లి పురాణంచెబుతూ, కొందిరి శిష్యురాండ్రను పోగుచేసుకుని, తమ అధికారవాంఛ ఆధ్యాత్మికంగా ఛలాయించుకుంటారు. కొందరు, తీరుబడిగావుంటే జైళ్లకెడతారు; కొందరు వుపన్యాసాలకి అధ్యక్షత వహిస్తారు. ఇల్లాగ కొత్తమార్గాలు తెలుసుకుని, నూతన కుతూహలం కలగచేసుకుంటే, కోడళ్లని మానసికంగా సంతోషపెట్టిన వాళ్ళవుతారు. అల్లాగే కొత్తసంగతులలో సరదాకలిగేటట్లు చెయ్యాలి. ఇనప్పెట్టె తాళం అత్తగారికే యివ్వాలి; ప్రతి స్వల్పవిషయానికీ, అత్తగార్లసలహా పుచ్చుకోవాలి. తమకింట్లో ప్రాముఖ్యతలేనట్లు నటించాలి. నటిస్తేచాలు, నిజంగా ప్రాముఖ్యతవాళ్లే వుంచుకున్నా. ఎందుకంటే, కాలంగడచిన స్త్రీ హృదయం నటనకి, యదార్థానికిభేదం తెలుసుకోలేదు. మంచిగా వుండటంకంటె, మంచిగావున్నట్లు నటించడం సులభం. సంసారంలో చాలావరకు నటన అవసరం; అని నా గట్టినమ్మకం.

ఈవ్యాసం యింతటితో ముగిస్తున్నా. పైచెప్పిన సిద్ధాంతాలవల్ల తేలిన ముఖ్యవిషయం వొకటే వుంది. పురుషుడికిమల్లేనే స్త్రీ హృదయంలోకూడా, తీరని వాంఛలనే మృగాలుంటాయి. అవి భయంవల్ల బైటపడవు. అక్కడికీ రాత్రిసమయంలో కలలమూలంగా దర్శనం యిస్తూంటాయి. పగలు అవి బైటకిరాకుండా 'తప్పు'అనే తాళంవేస్తాం. అప్పటికికూడా అవిచేసే గర్జనలు పగటిపూటకూడా వినిపిస్తూంటాయి. తెలియకుండా అవిచేసేగర్జనలే కలహాలకికారణం. అవి ఎట్లాంటి క్రూరమృగాలో పరీక్షించి వాటినోరు నొక్కాలి. మరో చిన్నసలహా, కోడళ్లు, అత్తగార్లకంటె మంచివాళ్లని అనిపించుకోడానికి యత్నించకూడదు. మానవహృదయం, యితరుల భాగ్యసంపదవిని యెల్లా నిరసిస్తుందో, యితరుల మంచితనాన్ని అల్లాగే నిరసిస్తుంది. "ఇతరులకంటెకూడా ఎక్కువ మంచిగా వుండటానికి యత్నించిన వ్యక్తి చెడ్డవాడు" అంటాడు బ్రాడ్లే. (F. H. Bradley.)

కలహాలకికారణం అత్తలే అన్నానని, యిది చదువుకున్న అత్తగార్లు నన్ను తిట్టనక్కర్లేదు. ఎందుకంటే, వాళ్ళకోడళ్లుకూడా కొంతకాలానికి అత్తలు కాబోతున్నారు కాబట్టి, నే చెప్పినవన్నీ వాళ్ళకికూడా సమానంగా అన్వయిస్తాయి. మరోసారి, కోడళ్ళ సైకాలజీ వ్రాయగలనని నమ్ముతున్నాను, అంతే.

ఇంగ్లీషు తెలిసినవారు, యీ విషయాన్ని గురించి యింకా తెలుసుకోవాలనివుంటే, వాళ్లకి సులభమయ్యే ముఖ్యమైన గ్రంథాలజాబితా యిక్కడ వ్రాస్తున్నాను. ఈ వ్యాసంలోనిదోషాలు నావిక్కాని, యీ దిగువ గ్రంథాల రచయితలవి కావు.

(1) The under world of the Subconscious. (Sigmund Freud)
(2) Fantasia of the unconscious. (D. H. Lawrence)
(3) Ego and the Love of power in woman. (Adler)
(4) Psychology of the Old maid. (jung & Mcdowgall)

# సేవకావృత్తి

శ్రీయుత అచ్యుతుని వేంకటాచలపతిరావు

సీ. సోచ్ఛ్వాస నిశ్వాస శోభితంబేగాని మరణంబుకంటె దుర్భరము సేవ
తగులఁబెట్టెడు నిప్పు లగపడవేకాని కార్చిచ్చు నడిమంటకాల్పు సేవ
పంకిలవస్తు సంస్పర్శ హీనమెకాని భయదమాలిన్య సంప్రాప్తి సేవ
కాల్సేతి సంకెలల్ ఘల్లుమనవే కాని కానరానిది బందిఖాన సేవ

గీ. నరకమున కేగకుండ నీ ధరణిమీఁద ననుభవంబగు ఘోర యాతనమె సేవ
కడకుఁ బంచపాతకములఁ బొడిచి గెల్చు పాడుసేవ యాఱవ మహాపాతకంబు.

ఉ. ఈవిధి దేహమమ్ముకొను చెంతయు గాసిలి వాసివీసముల్
బోవిడిపొట్ట కక్కురితిఁ బ్రొద్దుటినుండియుఁ జెప్పుదెబ్బలన్
వావిరిగా గడించి తలవాచియు వైతరణీ నదీ పరి
ప్లావితులట్ల కొట్టుకొను పాపులు దాస్యనికృష్ట జీవనుల్.

గీ. తన శరీరము తనకు సాధనము కాదు తన ఘడియలెల్లఁ దనచేత మనుటలేదు
తన ప్రచారమ్ము తనయిచ్చఁ గొనుచురాదు దాస్య మనఁగశ్వవృత్తి యథార్థమయ్యె.

గీ. ఏనాఁ డెవ్వరు పలికిరో యీ నీచపు దాస్యమున శ్వవృత్తియనుచు హా
యీనాఁడు శ్వవృత్తియె మేలై నెగడెన్ కుక్కకింత హైన్యము గలదే?

మ. తిరుగున్ గోరికతీర వీధి ననురక్తిన్ దోక జాడించుచున్
విరివిన్ విస్తరియాకులన్ నెమకి కీవిన్ గాకికిన్ బెట్టకే
వరుసన్ సర్వము నాకివేయు బిరుదంబా గ్రామ సింహంబహో
సరిరానేర్తురె? సేవకుల్ శునకహర్షంబన్న సామాన్యమే?

గీ. ఒక్క పూటేనిఁ దినఁగాక యొదవదేని యాకులలములు దినుగాక యబ్బదేని
బిచ్చమెత్తుగాకి కుక్క వృత్తియనుచుఁ బిలువఁబడు సేవకావృత్తి వలదు వలదు.

# కళాపోషణ

శ్రీ ధరణికోట శ్రీ రాం



"నరసింహారావుగారు! యీదినం తమపాత్ర నిర్వహణం మహా అద్భుతంగావుంది. మీబోటి నటకులుండబట్టే యింకా నాటకరంగం సజీవంగావుంది. లేకపోతే యీసరికి సినీమాలదాడితో నాటక కళ పూర్తిగా అంతరించేదే."

నిజంగా నరసింహారావు కళోపాసకుడు. జీవరహితంగా, గ్రంథాల అట్టలమధ్య తలదాచుకొని వున్న పాత్రలకు ప్రాణంపోసి అద్భుతవ్యక్తులుగా తయారుచేసే చాకచక్యం వున్నదాయనకు. ఆ దినం ధరించింది నలపాత్ర. వేలవర్షాలక్రిందట రాజ్యాన్ని, భార్యను, సంపదను, సౌఖ్యాన్ని పోగొట్టుకొని కలిదేవత పైశాచకనృత్య సంరంభ భయంకర పాదాలక్రింది నలిగి, కలిగి, వికృతరూపంతో, చివరకి కాలవైపరీత్యాన్నో, కవి చాతుర్యంచేతనో తన పూర్వసామ్రాజ్య వైభవాన్ని, యిల్లాలి ఆలింగనా సౌఖ్యాన్ని పొందిన నలచక్రవర్తి నిజంగా తల్లికడుపున వుద్భవించి భూముఖంచూచాడో, లేక కవి వూహాప్రపంచంలోనే పుట్టి, పెరిగి, పెద్దయై, ఆ మహాసామ్రాజ్యంలోనే అంతరించాడో మనకు తెలీదు. కాని నరసింహారావు ఆ చక్రవర్తి వేషాన్నిధరించి రంగంలో అడుగుపెట్టాడంటే మాత్రం, సజీవ నిషధేశ్వరుడు, తన పూర్వ సుఖదుఃఖాతిశయాలతో ప్రేక్షకుల ముందగిపించేవాడు. దమయంతి ప్రేమబంధాల్లో ఆయన్ని కీలించి, లాలిస్తుంటే అందరి మనస్సు పులకరించేది. అడవుల్లో క్షుద్బాధకు కుమిలిపోతూ, శనిప్రేరితంతో భార్య అర్ధవసనాన్ని సంగ్రహించి, యిల్లాలిని, వనవృక్షాలకు, భయంకర జంతుజాలానికి, సూర్యచంద్రాదులకు అప్పగించి, విచ్ఛిన్నమైపోతుండే హృదయాన్ని రెండుచేతుల బిగియపట్టుకొని ఒక్కపరుగున భార్య పొంతనుండి పరిగెత్తిన సమయంలో చూచే వారిహృదయాలు, కరిగి కండ్లలోంచి ధారాపాతంగా ప్రవహించేవి.

"తమ ప్రశంసకు నా నమస్కారాలు. నేను నిజంగా ప్రశంసార్హుణ్ణి గానేమో" నన్నాడు. నరసింహారావు జమీందారుగా రందిచ్చిన చేతి నందుకుంటూ.

ఆయన తరువాత ప్రేక్షకులలోనుండిన అధికారులు, యితర పురప్రముఖులు నరసింహంచుట్టూ మూగారు. ఒక ఉత్సాహపురుషుడు, దమయంతి స్వయంవర సమయంలో వుపయోగించిన పుష్పమాలనుతెచ్చి, నరసింహం మెడలోవేశాడు. అందరు కరతాళాలు మ్రోగించారు.

ఆ గుంపును త్రోసుకొని ఒకచిన్నపిల్లాడు నరసింహంవైపు పోయినాడు. వాడికండ్లలోంచి కన్నీళ్లు కారుతున్నై—పెదవు లదురుతున్నాయి. "బాబాయ్! అమ్మకు చాలా కష్టంగావుంది. శాస్తుర్లుగారు నిన్ను పిలుచుకొని రమ్మన్నారు." అన్నాడు గోపాలు డాయన మొఖంవైపు చూస్తూ.



మూడుదినాలనుంచి పద్మావతమ్మకు సరిగాలేదు. ఎప్పుడూవచ్చే జ్వరంలాంటిదే కదా అని మొదటి రెండుదినాలు గంజిపత్యంతో యింట్లోవుండే జ్వరంమాత్రలు వాడారు. ప్రయోజనం లేకపోయింది. మూడో రోజూవుదయం నూటనాలుగు డిగ్రీలవరకు పొంగింది జ్వరం. చిరపరిచితులైన నారాయణ శాస్తుర్లుగారిని పిలుచుకొనివచ్చి చూపించాడు నరసింహం.

"అయ్యో! నాయనా! మొన్ననే నాకు కబురంపకూడదుటోయ్. వ్యాధి ముదిరిన లక్షణాలు కనపడుతున్నా"యన్నారు శాస్త్రిగారు. నరసింహం హృదయంలో ఒక్క పిడుగు పడినట్లైంది. భార్య వైపుచూచి 'పద్మా'అని పిలిచాడు. ఆమె పెదిమెలు కదపలేకపోయింది. గుండ్రని ఆమె కన్నులనిండా కన్నీళ్లు తిరిగాయి. మంచానాన్నానుకొని తనవైపుచూస్తున్న గోపాలుడివైపుచూచి మరల నరసింహంవైపు చూచింది. అర్థంగ్రహించి నరసింహం మొహానికి గుడ్డ అడ్డంపెట్టుకొని బుడబుడ దుఃఖించాడు.

"దుఃఖిస్తే అవుతుందా నాయనా! అమ్మాయికేమి ఫరవాలేదు. నీవిలా కన్నీళ్లు కారుస్తుంటే రోగికి గుండె చెదిరిపోదూ! గోపాలు చూడూ యెంత బెంగపోయినాడో!" అన్నారు శాస్త్రిగారు.

నరసింహం "శాస్తుర్లుగారు! పద్మకు జ్వరం నెమ్మదిస్తుందా? నా సర్వస్వాన్ని మీ చేతుల్లో వుంచుతున్నాను. పద్మను మఱల అనుగ్రహించాలి నాకు" అన్నాడు.

సాయంకాలానికి జ్వరతీక్ష్ణత కొంచెం తగ్గింది. రోగి నిద్రపోతోంది. శాస్త్రిగారిక ఫరవాలేదన్నారు. ఆరున్నరకు ఒక పిల్లవాడు సుబ్బారావుగారి దగ్గరనుంచి ఒకచీటి తెచ్చిచ్చాడు నరసింహానికి. అంతవఱకు ఆనాటినాటకం విషయమే మరిచిపోయినాడు యిల్లాలి బెంగలోపడి. ఈ పరిస్థితుల్లో యేం చేయాలో తెలిసిందిగాదు. ముక్కుమీదికి వచ్చివుండే భార్యను విడిచిపెట్టి వెళ్లడమా? లేక తనకు సర్వస్వమూ అయిన కళాదేవి ఆరాధనను విసర్జించడమా?

పద్మను హృదయపూర్వకంగా ప్రేమించి వివాహం చేసుకున్నాడు. తొలుత ఆమె మరిపాలు గురిపిస్తుండే రూపానికి లొంగిపోయాడు. సంసారంలో ప్రవేశించి, అనంత్యమైన ఆమె కోమల మనోద్యానంలో, సుగంధాలీనుతుండే పుష్పాల నేరుకుంటూ ముగ్ధుడైపోయినాడు. తన్ను కాల్చేయాలని ప్రయత్నించే సంఘాన్ని క్షమించాడు, ఆ సౌఖ్యపు మత్తులో.

పిత్రార్జితమంతా క్షీణించి, సంపాదన సంకుచితమై, కడుపునిండటమే మహా కష్టంగావుండే ఆ కాలంలో తనపద్మను, పద్మా ప్రసాదుడైన గోపాలుణ్ణి చూచుకుంటూ కాలక్షేపం చేశాడు. తనకు పద్మను మించినవా రెవరున్నారీ ప్రపంచంలో!

అయితే కళాదేవి? చిన్ననాటినుంచి తానాదేవతారాధన యేమరకుండా చేస్తున్నాడు. పద్మ బాహుబంధనా సౌఖ్యమెరుగకముందే యీ కళాదేవి మాతృప్రేమను రుచిచూచాడు. తొలినాడే తన జీవిత సర్వస్వాన్ని ఆమె పాదాలముందర నైవేద్యం చేశాడు. ఆదేవి దీవనాఫలితమే పద్మ, గోపాలురని నమ్మాడు. వారి పోషణలో ఆమెకుమాత్రం బాధ్యతలేదు.

నరసింహం మనస్సును ధృఢం చేసుకున్నాడు. కళారాధన నిలుపదు......

♦ ♦ ♦ ♦

నరసింహం, గోపాలుడితోగూడ యింటికొచ్చేసరికి పద్మావతమ్మ పరిస్థితి చాలా క్లిష్టంగానే వుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు బహు కష్టంగా జరుగుతున్నాయి. శాస్త్రిగారు పడకప్రక్కన్నే కుర్చీమీద కూర్చొనున్నారు. తనతల్లి, మంచంప్రక్కన మందులునూరుతూ కూర్చొని, నరసింహాన్ని చూడగానే గొల్లుమని యేడ్చింది. పద్మ కన్నులు తెరిచింది. గోపాలుడు పెద్దపెట్టున 'అమ్మా'అని యేడ్చాడు. మంచంలో కూర్చొని పద్మ కండ్లనుండి కారుతుండే ఉష్ణభాష్పాలను తుడిచాడు నరసింహం. కాళ్లుచేతులు పట్టుకొని

చూచాడు. మంచుగడ్డకు మల్లే చల్లగావుందిదేహం. దీపం ఆరిపోతున్నదని గ్రహించాడు. 'పద్మా! పద్మా!' అని దీనంగా పిలిచాడు. కన్నులుతెరిచి గోపాలుణ్ణి ప్రక్కన కూర్చోపెట్టమని సంజ్ఞచేసింది, మహాప్రయాసతో. గోపాలుడి చేయిపట్టుకొని, నరసింహంచేతిలోపెట్టి కన్నీరు కార్చింది. ఆ దుఃఖాశ్రువుల్లోంచి మొలక నవ్వొకటి కనిపించింది. స్వర్గద్వారం ఆపెదృష్టి కందిందేమో! అంతటితో స్మృతిదప్పి కండ్లు మూసింది. అందరూ గొల్లుమన్నారు. సూర్యోదయం కావస్తున్నది. సూర్యదర్శనంతో పద్మ తొడిమను వీడి, రాలిపోతుందా?

శాస్త్రుల్లుగారు చేయిచూచి యేడువ వద్దన్నారు. ఇంకా అంతా పూర్తికాలేదు.

"నరసింహం! నాచేత నైనమట్టుకు పద్మకు చికిత్సలుచేశాను. ఇంక నీ అదృష్టం. జిల్లా డాక్టరుగారు చాలా తెలివిగలవారంటారు. ఒకమా రెలాగైనా ఆయన్ను పిలుచుకొనొచ్చావంటే, నీ అదృష్టం, గోపాలుడి నుదుటిరేఖ బాగుంటే, యిప్పటికి ఆయనను మించిపోదనుకుంటాను."

పెద్ద డాక్టరును పిలుచుకొని రావాలని నరసింహం అంతకు ముందటిదినమే అనుకున్నాడు. కాని ఆయన వూరకనే వస్తాడా. ఆయన ఫీజు కివ్వాలనినడబ్బు! మందుఖర్చులు!! తన్ను ప్రశంసిస్తుండే ధనాఢ్యులు, తనకేలాటి సహాయముచేయరని అతనికి పూర్వానుభవంవల్ల చక్కగాతెలుసు. తన జీవితాన్ని ధారపోసి పద్మప్రాణాన్ని దక్కించుకోటానికి నరసింహం సంకోచించడు. అయితే పైక మేలా సంపాదించగలడు. దేవుడికృప చల్లగావుంటే పద్మ కులాసాగా వుండకపోతుందా అనుకున్నాడు. శాస్త్రిగారిసలహామటల అవే వూహలను రేపాయి. గట్టిప్రయత్నం చేయాలని నిర్ధారణచేసుకొని ప్రక్కనుండే తుండుగుడ్డ మీద వేసుకుని బైలుదేరాడు.

అప్పుడప్పుడే జనసంచారం సాగుతూవుంది. బాణంలాగ రివ్వుమని ఒకమోటారు అతనిప్రక్కనుంచే పోయింది. దానిలో యెవరో ఆడవాళ్లు కిలకిల నవ్వుతూ కూర్చున్నారు. మోటారు వెంటనే లేచిన దుమ్ము నరసింహం ముఖంనిండా కప్పేసింది. పక్షులు నూతనోత్సాహంతో పరుగులు వారుతున్నాయి. ప్రక్కనేవుండే మంగలివీధినుంచి, సన్నాయి మనోహరంగా వాయిస్తున్నాడో సాధకుడు.

పాండురంగంగారి బంగళా మైలుదూరంలో వుంది. వకీలుగారప్పుడే పండ్లుతోముకుంటూ తోటలో కూర్చొని తోటమాలి భార్యకేవో కబుర్లు చెబుతూ నవ్విస్తూ తనూ నవ్వుతూన్నారు. నరసింహాన్ని చూచి మరోకుర్చీ తెప్పించే మిషతో దాన్ని తరిమేశారు.

'ఏమోయ్! నరసింహం! అలావున్నావు. రాత్రి రావటానికి వీల్లేకపోయింది. సుబ్బారావుగారు డోనార్సు టిక్కెట్టు పంపించారుకూడాను! (నిజంలో ఆ టిక్కెట్టునిచ్చి కొడుకును పంపించారు నాటకానికి) ఏలావుంది నాటకం?'

నాటకవిషయం రెండుముక్కల్లో చెప్పి, తను వచ్చినపని చెప్పాడు నరసింహం. డబ్బుమాట ప్రస్తావన రాగానే పాండురంగంగారి వైఖరి మారింది.

'క్షమించాలి, నరసింహం. ఈదినం వుదయం మావాడు గుంటూరు పోతున్నాడు. పరీక్షకు పైకం చెల్లించాలట. వాడి చదువుతో నా సంసారమంతా గుల్ల అయ్యేలాగుంది. ఈ కష్టకాలంలో అప్పు......'

ఇహ వుపయోగంలేదనుకొని నరసింహం లేచిపోయినాడు.

♦ ♦ ♦ ♦

'జమీందారుగారు, యింట్లో లేరని చెప్పమన్నారు. నన్నేంచేయమంటారు నరసింహంగారు, యీయనమూలాన్ని ప్రొద్దునలేచినప్పటినుంచి యింటికిపోయేంతవఱకు అబద్ధాలు చెప్పాలిసొస్తున్నది.'

'పైకమా! గవర్నమెంటు నౌకరి చేసే మాబోటివాండ్లదగ్గిర రెండవతేది తెల్లవారేటప్పటికి రూక వుండదని తెలియదటోయ్!'

◆ ◆ ◆ ◆

'అదుగో! అక్కడ నిలుచోనున్నాడే ఆయనే నరసింహారావు. ఈ సమయం తప్పితే మరి మనకు దొరకడాయన. వెంటనే పట్టుకోవాలె' నన్నాడు బంగారుశెట్టి, అమీనాగారి కోటులాగి, ఆయన భుజం మీదుగా నరసింహంవైపు చూపిస్తూ.

'మీరేనాండి నరసింహారావుగారు. మీరు బంగారుశెట్టికివ్వాలిసిన ఆరునూర్లముప్పైఐదు రూపాయల ఆరణాలకు మిమ్మలిని అరెస్టుచేస్తున్నాను. ఇదుగో యిక్కడ కొంచెం సంతకం చేయండి.'

'అరెస్టా? నన్నా? బంగారుశెట్టిగారు! నా భార్యకు చాలా జబ్బుగావుంది. ఈదినం నన్ను క్షమించారంటే...'

'నీబోటివాండ్లను చాలామందిని చూచాను. ఇంతకాలంనుంచికూడా, యేదో పెద్దమనిషివికదా అనుకున్నాను. అమీనాగారు! మీపని మీరు చేయండి.'

◆ ◆ ◆ ◆

జైలు గడియారం తొమ్మిది కొట్టింది. దేహస్మృతిలేని నరసింహారావును లోపలవేసి యినుప తలుపులు బిగించారు.

సాయంకాలం నాలుగుగంటలు. జైలు బైట కుక్కలుమొరిగిన శబ్దం. నరసింహానికి స్మృతివచ్చింది వున్నట్లుండి. యెవరో వెక్కివెక్కి యేడుస్తున్నారు. కండ్లుతెరిచి చూచాడు గోపాలుడు తలుపుకమ్మలను పట్టుకొని రాళ్ల మెట్టుమీద కూర్చొని తనకేసి చూస్తూ యేడుస్తున్నారు. నరసింహం లేచి కూర్చొని, తలుపు కమ్మల సందునుంచి గోపాలుణ్ణి తన చేతుల్లోకి తీసుకున్నాడు.

'బా...బా...య్! అమ్మను ఎ...త్తి...కెళ్లారు. నీ...వు యిం...టికి...రావూ?' అన్నాడు వెక్కివెక్కి యేడుస్తూ గోపాలు.

'ఆ! పద్మనా! గోపాలూ మీ అ...మ్మ...ను ప...ద్మా! ప...ద్మా!!.'

ఈ పాపభూయిష్టమైన ప్రపంచంలో నరసింహం ఉచ్చరించిన తుదిశబ్దాలవి. ఉదయాన్నుంచి క్షణక్షణం బిగుసుకుంటూవుండే అతని హృదయతంత్రులు వొక్కపెట్టున పెళ్లుమని తెగిపోయినాయి. కొట్టిన ప్రానల్లే విరగబడ్డాడు. మరుక్షణమే, గోపాలుడు అనాధశిశువైనాడు. మాంసాన్ని కొరుక్కుతినే నరహంతకులతో నిండిన ప్రపంచముందు, ముక్కుపచ్చలారని గోపాలుడున్నాడు!

◆ ◆ ◆ ◆

మరుసటిదినం పత్రికల్లో యీలా ప్రకటించారు. 'ఆంధ్రనటచక్రవర్తి నరసింహారావుగారు నిర్యాణమందారు. ఆంధ్రనాటకరంగానికి నూతనశోభతెచ్చిన మేటి. చిన్ననాడే నాటకరంగంలో ప్రవేశించి, తన జీవితాన్ని, తన ప్రేయసి జీవితాన్ని, యీ దేవీపీఠంముందర బలియిచ్చిన త్యాగి. యెనిమిదేండ్ల కుమారుణ్ణి మాత్రం ప్రపంచానికప్పచెప్పి ప్రపంచనాటకరంగంనుంచి నిష్క్రమించారు! ఆ దంపతుల ఆత్మకు శాంతి గలుగుగాక! తల్లిదండ్రులులేని అనాధశిశువును దైవము పోషించుగాక.'

◆ ◆ ◆ ◆

ఆంధ్రలోకం, నరసింహం చేసిన సేవకు తగిన సత్కారం చేశాముగదా అని చిరునవ్వు నవ్వి, ఆ కళారాధకుణ్ణి మరిచిపోయింది—




## పిన్ని ఉత్తరాలు

# బొంబాయి రాష్ట్రము

సర్వమంగళా,

మొన్న మాయింటికి ఓ అమ్మాయి వచ్చింది. ఆ పిల్లకి మనమాట అర్థంకాదు. అరవంకూడా తెలీదు. వాళ్లు మహారాష్ట్రులుట. వాళ్లు మాట్లాడేభాష 'మరాటీ' అంటారు. వాళ్ల ఊరు పూనాకి దగ్గిరగా ఉందిట.

పూనా అనేది ఓపెద్ద పట్టణం. ఇదెక్కడుందో తెలుసా? బొంబాయిరాష్ట్రంలో ఉంది. మన దేశంలో పడమటగాఉంది ఈరాష్ట్రం. ఇది రెండు భాగాలుగా ఉంది. ఉత్తరభాగం, దక్షిణభాగమున్నూ. దక్షిణభాగంలోఉన్న వాళ్లంతా మహారాష్ట్రులు.

ఈ మహారాష్ట్రులలో చాలాగొప్పవాళ్లు పుట్టేరు. శివాజీ అనే ఓ రాజు పుడత ఈ దేశంలోనే. ఆయన ఓ మహావీరుడు. మన మతంఅన్నా దేశంఅన్నా చాలా అభిమానం ఆయనకి. ఇతర మతాల వాళ్లొచ్చి మనదేశాన్ని ఆక్రమించుకుని రాజ్యం చెయ్యడం ప్రారంభించడంచేత మన హిందూమతం పాడైపోతోందనీ, మన స్వతంత్రం నశించిపోతోందనీ శివాజీ విచారించి, వీటిని బాగుచెయ్యడంకోసం పెద్ద సైన్యాన్ని పోగు చేసుకుని శత్రువులతో పోరాడేడు. ఓ పెద్ద సామ్రాజ్యాన్ని స్థాపించాడు. ఈయనకు చిన్నప్పటినుంచీ దేశంమీదా, మతంమీదా అభిమానం పుట్టించినది ఈయనతల్లి. ఆవిడ పేరు జిజీబాయి.

ఈ మహారాష్ట్రంలోనే అహల్యాబాయి అనే ఓ రాణీ రాజ్యం చేసింది. ఆడదైనా మగవాళ్ల కంటే ఎక్కువశక్తి సామర్థ్యాలతోటీ ధైర్యసాహసాలతోటీ రాజ్యం చెయ్య గలిగిందిట అహల్యాబాయి.

మీ యింట్లో దేశనాయకుల ఫోటోలున్నాయి చూడు. అందులో గోపాలకృష్ణ గోఖలే, బాల గంగాధరతిలక్ అనే ఇద్దరి పటాలున్నాయి. వీరిద్దరూ కూడా మహారాష్ట్రులే.

బొంబాయి రాష్ట్రంలో ఉత్తరభాగంలో ఉన్నవాళ్లు గుజరాతీభాష మాట్లాడతారు. గాంధీ గారు గుజరాతులోనే పుడత. ఎక్కడ పుడితేనేమి? ఆయనపేరు ప్రపంచమంతా వ్యాపించి పోయింది! అంత గొప్పవాడాయన! అందుకే ఆయనను 'మహాత్ముడ'నడం.

బొంబాయిరాష్ట్రానికి ముఖ్యమైన నగరం బొంబాయే. ఈ నగరం చాలా పెద్దది. చెన్నపట్టణానికీ బొంబాయికీ ఎంతో తేడా ఉంది. చెన్నపట్టణంలో మేడలకి మూడు అంతస్థులకంటే ఎక్కువలేవు. బొంబాయిలోనో! ఆరేసి అంతస్థులు! ప్రతీ అంతస్థుకీ ఎన్నోగదులు. ప్రతీ గదిలోనూ ఎంతోమంది మనుష్యులు. తేనెపట్టుల్లో ఈగలకి మల్లే ప్రతీమేడలోనూ కిటకిటలాడుతూ మనుషులుంటారు. ఏంచేస్తారు, ఉండక? ఆనగరంలో మనుష్యులెక్కువా, చోటు తక్కువాను. ఇన్ని అంతస్థులుంటే వాళ్లకి ఎక్కడం దిగడం కష్టంకాదూ మరి? ఈ శ్రమలేకుండా, మనుష్యుల్ని అంతస్థుల మీదకి తీసుకెళ్లడానికి, క్రిందికి దింపడానికి ఓ యంత్రం ఉంది. అది ఓ గదికి మల్లేనే ఉంటుంది. అందులోకెళ్లి నిలబడి మీట నొక్కితే ఏ అంతస్థు మీదకి పోవాలంటే అక్కడకు పోవచ్చు. ఇలాంటివి చెన్నపట్టణంలో కూడా అక్కడక్కడ కొద్దిగా ఉన్నాయి.

ఈ అంతస్థులుండడం ఒక్క మేడలకే అనుకున్నావేమో! బస్సులకీ, ట్రాములకూ కూడా అంతస్థులే! వాటినిండా జనమే.

ఇన్నేసి అంతస్థుల మేడలున్నా బొంబాయిలో ఉద్యోగాలు చేసేవాళ్లందరికీ ఆ నగరంలో చోటు లేక చాలామంది ఆ చుట్టుపక్కల ఊళ్లలోఉండి రోజూ బొంబాయికి రైళ్లలో వచ్చి వెడుతోంటారు.

ఇంతమందికి ఉద్యోగాలుండడానికి ఈ నగరంలో ఏముందంటావేమో; పెద్ద పెద్ద ఆఫీసులు చాలా ఉన్నాయి ఈ నగరంలో. బ్యాంకులూ, కంపెనీలూ, షాపులూ ఉన్నాయి. అంతేకాదు; బట్టలు తయారు చేసే యంత్రశాలలున్నా యెన్నో. బొంబాయి ఓడలరేవు కూడాను. తెల్లవాళ్ల దేశాలకు వెళ్లాలంటే బొంబాయిలోనే ఓడఎక్కి వెళ్లడం.

బొంబాయిలో మహారాష్ట్రులూ, గుజరాతీలే గాకుండా ఇంకోతెగవాళ్లు కనబడతారు. వాళ్లని 'పార్సీలు' అంటారు. వాళ్లమతం హిందూమతంకాదు. వాళ్లు అగ్నిని కొలుస్తారు.

'సక్కూబాయి' సినిమా చూశావుకదూ నువ్వు? సక్కూబాయీ, యింకాభక్తులూ భజనచేసుకుంటూ, పాండురంగ విఠల్ దేవుడుకోసమని పండరీపురం యాత్ర కెడతారు. ఈ పండరీపురం ఎక్కడుందో తెలుసా? బొంబాయి రాష్ట్రంలోనే.

అమ్మాయీ, మన తెనుగుదేశానికీ బొంబాయిరాష్ట్రానికీ ఓ చుట్టరికం ఉంది. ఏమిటో చెప్పనా? బొంబాయిరాష్ట్రమేమో మన గోదావరితల్లి పుట్టినచోటు. ఈ ప్రదేశం మనఊరికి ఎంతదూరమో తెలుసా? తొమ్మిదివందలమైళ్లు! ఎన్నివందల మైళ్లవుతేనేమి? ఆడజన్మ ఎత్తేక భర్తతో కాపరంచెయ్యడానికి ఎన్ని వందల మైళ్లదూరమైనా వెనకతియ్యక, పోవలసిందే. నేను పుట్టిల్లు వదిలేసి నాలుగొందలమైళ్లు రాలేదూ? అలాగే గోదావరీని. ఆడవాళ్లు పుట్టి పెరిగి, అక్కడిదంతా సారెక్రిందా, కట్నంకిందా తెచ్చి అత్తింటికి చేరుస్తారు. గోదావరికూడా అంతేకదూ చేస్తోంట? తాను పుట్టిపెరిగిన చోట్లలోంచి, ఒండ్రుమట్టీ, నీరూ అంతా తెచ్చి, సముద్రం దగ్గరున్న మనకిపెడుతోంది!

మీ అమ్మనీ, అందర్నీ అడిగేనని చెప్పు. నువ్వు బాగా శ్రద్ధగా చదువుకోవాలి సుమా.

చెన్నపట్నం,
1—1—1941

పిన్ని.



# గానకళ ★ సంగీతోపాధ్యాయ శ్రీ గాలి పెంచలనరసింహారావు

## కానడరాగము — ఆదితాళము

ఆరోహణ : స రి గ మ ద ని స

అవరోహణ : సనిపమపదనిదపమగామరిస

షాడవ వక్రమరాగము

22 వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యందు జన్యము.

వ్రేలికి నాలుగు అక్షరముల చొప్పున ఘాతనుండి పాడుకొనవలయును

పల్లవి : రామా! రఘుకుల సుధామ! శ్రీ॥ రామా॥

అనుపల్లవి : సామాన్యపు మానవునకుయిల
నీమహిమ తెలియగ నేమి జెప్పినఫలమే॥ రామా॥

చరణము : నీ నామస్మరణము ధ్యానంబు జేయుటకు
ఘ్నానాథనాథుడేమి దీనార్తి దీనూడేమి
పోనాడక మానసమున నిను
పూనికతో సేవించేటి పుణ్యపురుషులెందరో॥ రామా॥

| | | | |
|---|---|---|---|
| పల్లవి : | రీ ,, - ,, మా గామా మగమా | రీసా - రిసనీ | ,, దా - నీసా |
| | రా ,, - ,, మాఆఆరఅఘు | కుల - సుఉధా | ,, మ శ్రీఈ |
| | రీ ,, - ,, నిప మగమా మగమా | రీసా - రిసనీ | ,, దా - నీసా |
| | రా ,, - ,, అఅఘుఅఆరఅఘు | కుల - సుఉధా | ,, మ - శ్రీఈ |
| | రీ ,, - , సరిమ గాఃగా మగపమ | మరిరిస - రిససని | నీదా - నీసా |
| | రా ,, - , అఅఅమాఆగఅఘుఉ | కుఉలఅ - సుఉధఅ | ఆమ - శ్రీఈ |
| | నిసరిమప నినిప - మగమా మగమా | మరిరిస - రిససని | నీదా - , నిసా |
| | రఅఅఆఅఅ - మఅఆరఅఘు | కుఉలఅ - సుఉధఅ | ఆమ - , శ్రీఈ |
| | సరిమపదని పమగమా, మగమా | మరిరిస - రిససని | నీదా - , నిసా |

| | | | |
|---|---|---|---|
| | రఅఅఅఅఅఅఅమఅ, రఅఘు | కుఉలఅ - సుఉధఅ | ఆమ - , శ్రీఈ |
| | సరిమప దనీప మగమ గామనిప | మగమా - రిసని | రిసని దానిసా |
| | రఅఅఅఅఆఅమఅఅఆఅరఘు | కుఉల - సుఉధఅ | అఅఅమాఅశ్రీ\|\| |
| అనుపల్లవి : | పా ,, - ,, మపనీ దానీ మాపా | ,, పసా సనీ | రీసా - సారీ |
| | సా ,, - ,, మఅఆఆఆన్యపు | ,, మఅనవు | నకు - యిఇల |
| | నిపా , - ,, మపనీ దానీ మాపా | ,, మపనిస - రిమగామరీస | సాసా - సనిరీ |
| | సఆ , - ,, మఅఅఆఆన్యపు | ,, మఅఅఅఅఅఆఅనవు | నకు - యిఇల |
| | సనిపా ,, - ,, మపనీ దానీ మాపా | ,, పసా సనీ | రీసా - సాసా |
| | సఅఆ ,, - ,, మఅఆఆఆన్యపు | ,, మఅనవు | నకు - యిఇల |
| | పరిరీ - రీసా - సనిరిస - నిపపా | మాదని - సనిపా | మగమా - రీసా |
| | నిఇమ - హిమ - తెఎలిఇయఅగ | నేమిఇజెఎప్పి | నఅఫ - లమె |
| | పరిరీ - రీసా - సనిరిస - నిపపా | పదదని - రిసనిప | మగమా రీసా |
| | నిఇమ - హిమతెఎలిఇ - యఅగ | నెఎమిఇ - జెఎప్పిఇ | నఅఫ - లమె |
| చరణము : | రిమమా - ,, మా మామా మగమా | మపా , - పదనీ పా | మగమా - రీసా |
| | నిఇనా - ,, మస్మరణఅము | ధ్యాఅ , నంంబు | జెఎయు - టకు |
| | రిమమా - ,, మా మామా మరిమా | సరిగమ - దనిపా | మగమా - రీసా |
| | నిఇనా - ,, మస్మర - ణఅము | ధ్యాఅనంంంబు | జెఎయు - టకు |
| | రిమారీ , సా - సనిరిస - నీదా | సరీరీ , రీ | సరిమగమా - రీసా |
| | క్షమాఆనాథ - నఅధుఉడేమీ | దిఈనా , తీ | దిఇనుఉఉడేమి |
| | రిమారీ , సా - సని నిరిసారిస - నీ , ద | సరీరీ , రీ | సరి పమగమ రీ , స |
| | క్షమాఆనా , ధనఅధుఉఉఉఉడే, మి | దిఇనా , తీ | దిఇనుఉఉఉడే , మి |
| | పా ,, - ,, మపనీ దానీమాపా | ,, పసాసనీ | రీసా - సారీ |
| | పో ,, - ,, నఅఆఆడక | ,, మఅనస | మున - నిను |
| | నిపా , - ,, మపనీ దానీమాపా | ,, మపనిస - రిమగామరీస | సాసా - సనిరీ |
| | పాఓ ,,- ,, నఅఆఆడక | ,, మఅఅఅఅఅఆఅనస | మున నిఇను |
| | సనిపా ,, - ,, మపనీ దానీమాపా | ,, పసా సనీ | రీసా - సాసా |
| | పొఒఓ ,, - ,, నఅఆఆడక | ,, మఅనస | మున - నిను |
| | పరిరీ - రీసా - సనిరిస - నిపపా | మాదని - సనిపా | మగమా - రీసా |
| | పుఉనీ - కతో - సెఎవించెఎటి | పుణ్యాఅ - పుఉరు | షుఉలెందారో |
| | పరిరీ - రీసా - సనిరిస - నిపపా | పదదని - రిసనిప | మగమా - రీసా |
| | పుఉనీకతో - సెఎవిం - చెఎటి | పుఉణ్యాఅ - పుఉరుఉ | షుఉలెం-దారో\|\| రా\|\| |

చిట్టస్వరము.

| | | |
|---|---|---|
| రీ , రిమదనిస నిదనిపామగమ | రీస నిరిస నిస | పా , దానిసరి. |
| గామరీస - రిమదాని - మదనిసరి | గామరీస సా | స పాపా సాస |

రామా ! రఘుకులసుధామ ! శ్రీరామా !

# ఆంధ్ర రాజ్ఞీమణి ★ రుద్రాంబ

శ్రీ ఆచంట లక్ష్మీనరసింహాం

కాకతీయవంశ పారావారమున నపర లక్ష్మివోలె నవతరించి, గణపతిదేవుని యల్లారు ముద్దుబిడ్డయై పెరిగి, వీరోచిత క్షాత్ర విద్యలనెల్లనేర్చి, పితృదేవుని యనంతరము సువిశాల ఆంధ్రసామ్రాజ్య సింహపీఠి నధిష్ఠించి, నిజపరాక్రమాజ్ఞానులై యెదురు తిరిగిన సామంతులను, శత్రురాజులను, వారి ప్రచండ సైన్యములను, అపర దుర్గావతారమో యనున ట్లెదిర్చి, యాంధ్రనిర్వక్ర పరాక్రమమును రుచిజూపి, శత్రువాహినుల బలాయితులచేసి, వారిచే నరికప్పములగొని, విజయ స్తంభమునునాటి మరలి "సర్వోర్వీశ కిరీటకుట్టిమతటీ విన్యస్త పాదాంబుజయై" యనేకదాన ధర్మములతో, సత్కార్యములతో శాంతిని సుఖసంపత్తులను సమకూర్చి జనుల నానందాబ్ధిదేల్చి జగదంబయై, విదేశీయులు సైతము మెచ్చుకొనునట్లాంధ్ర సామ్రాజ్యమును 38 సంవత్సరముల కాలము శాసించి, భారత మహిళాలోకమునకును, విశేషించి యాంధ్ర నారీలోకమునకును, ధ్రువతారయై, యఖండ యశస్సును సంపాదించిన పావనమూర్తి, రుద్రమదేవి.

## ★ జన్మము, బాల్య శిక్షణ ★

ఈమె జనకుడు గణపతిదేవ మహారాజు. తల్లి సోమాదేవి. మహారాజున కీమె యేకమాత్ర పుత్రి యని కొందరును, యీమెకు గణపాంబయను సోదరి యుండెనని మరి కొందరును దెలుపుచున్నారు. క్రీ. శ. 1220-25 సంవత్సరముల నడుమ నీమె జన్మించినదని చరిత్రకారుల యభిప్రాయము.

ఈయమ సురూపయనియు, బాల్యమునుండియు బరమ గంభీరురాలనియు శాసనములు వగైరా యాధారములవల్ల దెలియుచున్నది.

ప్రఖ్యాతుడగు విశ్వేశ్వర శివదేశికుడను శైవాచార్యునికడ నీమె విద్యనేర్చెను.

మగసంతతిలేమి, గణపతిదేవు డీమె దన యనంతరము దగిన వారసురాలు గావలెనని, రాజకుమారోచిత విద్యలన్నిటిని, విశేషించి, క్షాత్రవిద్యలను గారవమున నేర్పించెను.

ఈమె రుద్రమదేవుడను నామమున పురుషరూపిణియై, యశ్వమునధిష్ఠించి, యనుదినమును తండ్రి సభకేగి రాజకార్యములలో పాల్గొనెడిదనియు, యాయనజీవితకాలమున నీమెయనేక యుద్ధములలో బోరాడెననియు, 1245 నుండి 1258 వరకును దండ్రికూతుండ్రిరువురును గలసి పాలించిరనియు దెలియుచున్నది.

ఈమె భర్తనుగూర్చి హెచ్చువివరములు దెలియకపోవుట విచారకరము. ఈయన చాళుక్యవంశీయుడగు నిందుశేఖరుని పుత్రుడనియు, పేరు వీరభద్రేశ్వరుడనియు, నీయన యొక్క సామంతుడనియు మాత్రమే దెలియుచున్నది.

ఈయన యిల్లరికముండెననియు ముమ్మడక్క యుమ్మక్కలను నిరువురు కుమార్తెలు జన్మించిన యనంతరమీయన యౌవనముననే మరణించెననియు నాంధ్రచరిత్రకారులు నిర్ణయించిరి.

## ★ రాజ్యారోహణము — సామంతుల తిరుగుబాటు ★

గణపతిదేవుడు స్వర్గస్థుడు కాగానే, ఆయనయిచ్ఛానుసారము రుద్రమదేవి, రుద్రదేవ మహారాజను నామాంతరముతో సింహాసన మధిష్టించి, రాజ్యచక్రము నడుపజొచ్చెను.

ఆంధ్ర సామ్రాజ్య భాగ్యచక్రమును నొకరమణీమణి నడుపుటయు, తామామె పాదములకు తల లొగ్గుటయు, నుద్ధతులగు సామంతులకు కంటకమయ్యెను. కాన తమస్వాతంత్ర్యమును బ్రకటించుటకును, వీలున్నచో నాంధ్రసామ్రాజ్యమును చేతనైనంతవరకు చేజిక్కించుకొనుటకును నిది మంచియదనని, వారుభావించి, నలువైపులనుండియు నొక్కుమ్మడి దిరుగుబాటొనర్చిరి. వీరిలోమూడవ కులోత్తుంగుడు, సిద్ధదేవచోడుడు, కేశవదేవుడు, సోమిదేవుడు, అల్లుగంగు, మల్లిఖార్జున దామోదరుడు మొదలగువారు ముఖ్యులు.

ఈ బెదరింపులకు ధీరయగు రుద్రమదేవి యావంతయు నధైర్యపడలేదు. స్వామిభక్తపరాయణు లును, నవక్ర విక్రమధుర్యులునగు నన్నమదేవుడు, త్రిపురాంతకుడు నను సేనానుల తోడ్పాటున శత్రువుల పై బడి, వారి సైన్యములను చించి, చెండాడి పరాజితుల నొనర్చెను. శత్రువులు దిక్కునకొకరుగా బరువెత్తిరి. శాంతినెలకొనలేదు. మరొక దిక్కునుండి దేవగిరి రాజగు మహాదేవరాజు 3 లక్షల యోధులతో తర్లివచ్చి యోరుగల్లు దుర్గమును ముట్టడించి, 15 దినములు ఘోరయుద్ధమొనర్చెను.

రుద్రమదేవి మొక్కవోని ధైర్యసాహసములతో యపూర్వోత్సాహముతో, విక్రమోపేతులగు దన సేనానులయు, సామంతులయు, సహాయసంపత్తితో బోరును దీవ్రముగ సాగించెను. మంత్రకౌశలమున, వారిని బురిగొల్పుటతో దృప్తినొందక, స్వయముగ సర్వసైన్యాధిపత్యమును వహించి, శ్వేతాశ్వరూఢయై, ఆయుధ ధారిణియై, రణరంగమునకురికి, తండోపతండములుగా శత్రువులను నేలగూల్చి దిగ్భ్రమకలిగించెను.

వీరవిహారము సల్పుచున్న యామెయొక్కయును, నామెసైన్యముల యొక్కయు ధాటికాగజాలక, యాదవసైన్యములు పలాయనములయ్యెను.

తేజోమూర్తియైన రుద్రమదేవి, లభించిన విజయముతో తృప్తినందక మున్ముందుసైత మేరును, నాంధ్ర సామ్రాజ్యము వంక దేరి చూడకుండ, గుణపాఠము గరపుటకుగాను, శత్రుసైన్యములను దేవగిరివరకు వెనుదరిమెను. అంతట మహాదేవ రాజీమెను శరణుజొచ్చి కోటిద్రవ్యము నపరాధముగా జెల్లించెను. దేవగిరి రాజ్యపు సరిహద్దున నీమె దన విజయగాధను దెలుపుచు నొక విజయస్తంభమును, శిలాశాసనమును నాటి, ఆంధ్రజోదుల జేజేధ్వనులతో రాజధానిని బ్రవేశించెను. ఈమెయందు రాజతంత్రజ్ఞతతోబాటు, అనుంతిత ములగు ధైర్యసాహసములును, యుద్ధ నైపుణ్యమును నిమిడియుండుట తెలుగుతల్లి భాగ్యము.

ఈ విజయముతో నిక సామంతుల పటాటోపము, ఔద్ధత్యము బూర్తిగా నణగిపోయెను. ఒకసారి మహారాజ్ఞి కూతురగు ముమ్మడమ్మ సంతాన కాంక్షియై వడ్డెపల్లి వినాయకుని గొలువనరిగి, యచట గొన్ని దినములుండి దిరిగివచ్చుసరికి, సవతికొడుకులగు మురారిదేవుడు, హరిహరుడును దుర్గమ్మాక్రమింప, స్వామి భక్తులగు సేనానులు, సైనికుల సహాయ్యమున వారి నశ్రమమున నోడించెను.

## ★ నాటిరాజ్య వ్యవస్థ ★

శత్రువుల యుపద్రవ మడగినంతనే, యీమె చల్లని పాలనమున సామ్రాజ్యమంతటను శాంతి యోలలాడ డొచ్చెను.

తన రాజధాని శత్రువుల కభేద్యముగానుండు నట్లీమె యోరుగల్లు దుర్గమును బాగుచేయించెను. దుర్గమును విస్తరించి, చుట్టును భూమికోటను గట్టించెను. దానిచుట్టును లోతైన యగడ్తను త్రవ్వించెను. పుట్టకోటకు, రాతికోటకు నెన్నియో బురుజులు, గౌనులు, దిడ్లు గట్టించెను. శత్రువులు ముట్టడించినప్పుడు లోనివారు సులభముగా పైకెక్కి గలుగుటకుగాను, రాతిగోడకు లోభాగమున మెట్లు గట్టించెను.

దుర్గ రక్షణమునకుగాను, కొమ్మకు యిద్దరు, బురుజుకు ఏబదిమందియు, దిడ్డికి నూర్గురును, గౌనుకు అయిదువందలమంది వంతున, రక్షణభటులు లేమరక గాచుచుండిరి.

సామ్రాజ్య రక్షణమునకీమె నవలక్ష ధనుర్ధరులను బోషించెడిదని ప్రతీతి. తెలుగుల స్వేచ్ఛా పతాక మాకసమంటిన రోజులవి!

## ★ రాజ్యపాలనము ★

రాజనీతిజ్ఞులు, శౌర్యధుర్యులునగు మంత్రి, సేనాధ్యక్షులు రాజకార్యములు నిర్వహింపుచుండ, ప్రీతి పురస్సరులగు ప్రజలు దోడ్పడుచుండ, నీ మహారాజ్ఞి తన కాలమునంతను ప్రజాక్షేమమునకు వినియోగించ జొచ్చెను. లెక్కలేనన్ని సత్కార్యముల నొనర్చుచుండెను.

ఈమె యొసగిన దానములకు, నిర్మించిన యగ్రహార వాపీకూపాదులకు లెక్కలేదు. స్వయముగా నిర్మించిన వానినేగాక పితృదేవుడు నిర్మించిన తటాకాదులసైత మీమె శ్రద్ధతో బోషించుచుండెను.

ఈ సందర్భమున నీమె యొనర్చిన నొక యత్యంత ముఖ్యమగు ధర్మమునుగూర్చి చెప్పవలసియున్నది. ఈమె శైవాచార్యుల కొసంగిన యగ్రహారమునందొక ధర్మ ప్రసూతిశాలను నిర్మించెనని, అదియే భారతదేశపు మొట్టమొదటి ప్రసూతిశాలయనియు తెలిసికొనుటకు, ఆంధ్రులు సకారణముగా గర్వించవచ్చును. మరియు నచటగల యన్న సత్రమునందు పంచములకు సైతమన్నదాన మొనర్చెడి వారన్న సంగతికూడ యంతటి ఆనంద దాయకమే.

నాటి కాకతీయ సామ్రాజ్యము పాలేరు గోదావరులమధ్యను, పడమటి కనుమలవరకు వ్యాపించి యుండెను. (మరి కొందరు కాకతీయుల సరిహద్దులు ప్రస్తుత ఆంధ్రజిల్లాలన్నిటికి కడపటనుండెనని వ్రాసి యున్నారు. ఇట్టి సామ్రాజ్యము నీమె "ఖలవర్జితముగాను, చాతుర్వర్ణములస్థితి దప్పకుండను" రక్షించెను.

కాకతీయ సామ్రాజ్యమును, ఓరుగల్లు, నగరమును స్వయముగాదర్శించిన ఇటలీ యాత్రికుడు మార్కో పోలో యీమె రాజ్యపాలనము నిట్లు ప్రశంసించియున్నాడు.

" ఈమె తన పూర్వులవలెనే ధర్మమును, నీతిని కాపాడి, దేశమునకు శాంతినిగల్పించి, తనప్రజలచే మిక్కిలి భక్తిపూర్వకముగా గొలువబడి, ప్రేమించబడుచు, చిరకాలము పరిపాలన మొనర్చెను. ఈమె కాలము నందంతకు బూర్వములేని వ్యవస్థలు సైతమేర్పాటు చేయబడెను."

శిల్పము, చేతిపనులు, చిత్రలేఖనము మిగుల నభివృద్ధిలో నుండెను. కవులకు రాజాశ్రయము విస్తారముగా నుండెను. రంగనాథ రామాయణ మీ కాలముననే రచింపబడెను. జనులెల్లరీమె "నంబా"యని పిలుచుచు, తమ కృతజ్ఞత దెలుపుట కీమెపేర రుద్రవరములు, నంబాల యగ్రహారములు పెక్కులు నిర్మించిరి. దేశము పెక్కుభాగముల నీ నామములు నేటికిని నమలులోనుండి, నీయంబ యమరకీర్తిని చాటుచున్నవి.

ఈ విధముగా నీమె పాలనము శత్రుభయంకరమై, జనరంజకమై, జగద్విఖ్యాతమయ్యెను. అశేషభారత వర్షమందైనను, అన్ని విధముల నీమెతో బోల్చదగినవారు రాణీ యహల్యాబాయి తక్క యొరులు లేరు.

### ★ ఆకాలపు ఆంధ్రదేశ వ్యాపారము ★

ఇందును గూర్చి పైన పేర్కొనబడిన మార్కోపోలో యిట్లు వ్రాయుచున్నాడు.

"ఈ రాజ్యమున శ్రేష్టమై, సన్ననైన వస్త్రములు వడికి, నేయబడుచున్నవి. వీని విలువ చాల యధికము. నిజముగా నీ బట్టలు సాలెపురుగు జాలెవలె నుండును. వీనిని ధరించ ముచ్చటపడని రాజుగాని, రాణిగాని ప్రపంచములోలేరు. మచిలీపట్టణము, పరిసరములును మస్లిన్ బట్టలకు, రంగు చీటీలకు బహుకాలమునుండి ప్రసిద్ధిగాంచినవి. ఓరుగల్లు జిల్లా కూనసముద్రమను గ్రామమున, శతాబ్దములనుండి ప్రసిద్ధి వహించిన డెమస్కస్ కత్తుల కవసరమగు యినుము లభించుచున్నది."

మచిలీపట్టణము, మోటుపల్లి రేవులద్వారా విదేశములలో హెచ్చుగా వ్యాపారము జరుగుచుండెను. దిగుమతులపై వివిధములగు సుంకములు విధించబడుచుండెను.

### ★ చరమదశ ★

వైభవోపేతమగు నీమె పాలనము క్రీ. శ. 1258 నుండి 1296 వరకు 38 దీర్ఘ వత్సరములు సాగెను. (37 సంవత్సరములని డాక్టరు హీగుగారి మతము.)

ఈమె తండ్రియభిమతము ప్రకారము, మనుమడగు ప్రతాపరుద్రుని దత్తతచేసికొని, క్రీ. శ. 1290 నుండియు నాతని రాజ్యకార్యములలో ప్రవేశపెట్టి, తాను ధార్మిక చింతాపరయైయుండి, క్రీ. శ. 1296 సంవత్సరమున శివసాయుజ్యమందెను. (ఈమె 80 సంవత్సరములు జీవించెనని ప్రాచీనగాధల మతము)

చరిత్రకాలమున, భారతవర్షమందు రాజ్యపాలన మొనర్చిన మహిళామణులలో నీమెయే యగ్రేసర. విదుషియై, నిష్కలంక చరిత్రయై, పరిపాలనాకాలము దీర్ఘమై, యవసానము శుభోదంతమై యుండుటయు నీరాజ్ఞమణి జీవితమునకు శోభగూర్చుచున్నవి.

స్త్రీజాతి కలంకారప్రాయమైన యీమెనుగూర్చి విద్యానాధ మహాకవి యమృతవాక్కులను, శ్రీ పాటిబండ మాధవశర్మగారి యుత్తేజితమగు నొక పద్యమును యిట నుదహరించి, యీ వ్యాసమును ముగించుచున్నాను.

శ్లో. యోరుద్రోరజతాచలేస్థితి మగా దర్ధాంగనారీః పురా సోయం సంప్రతి కాకతీశ్వరకులే సర్వాంగనారీ స్థితం ।

(కైలాసమునందు అర్ధనారీశ్వరుడైన రుద్రుడు కాకతివంశమున పూర్తిగా స్త్రీయైయవతరించినాడు)

సీ. కట్టించితివి వరంగలుచుట్టు చుట్టిరా మృత్తికామయ మైనభిత్తి యొకడు
త్రవ్వించితివి మహోత్తాల తాలకురుట్సి ఖాదఘ్నమైన యగడ్త యొకడు
ఉద్ధరించితి విధ్వంసోన్ముఖంబైన స్త్రీజాతి నిర్మలయశః కేతనంబు
గారవించితి కవీద్గందేభముల దానధారచెక్కుల జిడ్డుదేరునట్లు

ప్రజల బాలించితివి రామరాజ్యమునకు
సాటియని చెప్పుకొదగ్గ శాంతిగూర్చి
సలిపితివి నిశ్చలము బ్రహ్మచర్యదీక్ష
రుచిర సద్గుణనికురుంబ। రుద్రమాంబ ।

# భారతీయనారి



శ్రీ స్వామి వివేకానంద
అనువాదం : శ్రీ పూర్ణానంద్

(గతసంచిక తరువాయి)

విధవావివాహము లేకుండు విషయమును జింతింప బూనుకొనిన, ప్రథమ వర్ణవ్యయమున-స్త్రీల సంఖ్య పురుషులకంటె నత్యధికము. ఒక వైపున పురుషుల సంఖ్య తక్కువగుటవలన విధవ-వివాహము కొఱకు భర్త దొఱకుట కష్టము; అందువలన విధవకు కష్టము-ఇంకొక వైపున కుమారి (అవివాహిత) భర్తృ-సమస్య. ఇప్పుడు మీ ముందఱ విధవావివాహము లేక కుమారీ వివాహము అను సమస్యలలో నొక్కటి వచ్చి పడి తీరును. ఇప్పుడు మరల ఆ పూర్వ విషయమును మరల స్మరింపుము, భారతీయుని మనస్సు సంఘ-తాంత్రికము వారనునది, 'చూడుడు, కుమారీ సమస్యతో తులజూచిన విధవా_సమస్యగౌణము.'_ఏమి? ఏలయన వారొకపరి ఈ సుయోగమును బొందియుండిరి. వారు వివాహమాడిరి. భర్తృవియోగమున వారీ సుయోగమును బొందియు పోగొట్టుకొనిరే. కాని ఒకసారి స్థిరభావమున కుమారికల విషయమును జింతింపుము. వారు వివాహయోగము నొక్కసారియును బడయలేదు. ఒకనాటి సంగతి నా మనస్సున నున్నది. ఆక్స్‌ఫర్డు స్ట్రీటున పదియైన తరువాత వేలకొలది యువతులు బజారునకు అరుగుటగాంచి ఒక అమెరికన్ వచించెను. 'వీరికి వరులెట్లు లభింతురాయని భావించుచున్నాడను.' అందువలన భారతీయులు విధవలకు జెప్పునది. "మీరొక సారి సుయోగమును బొందితిరి. మీకు సంభవించిన ఈ ఆకస్మిక దుర్ఘటనకు మేము వాస్తవముగ వ్యథితులము. కాని, ఉపాయ మేమియును లేదు. ఇప్పుడు అన్యకుమారికలు వివాహ సుయోగమును ప్రతీక్షించుచున్నారు."

ఈ విషయమున ధర్మమేమి చెప్పునో, చూతము. ధర్మ మరుదెంచినది సాంత్వనమును గొని. ఒక విషయమును మీరు గుర్తించుకొనవలెను. మా ధర్మ మొసగు ఉపదేశము, వివాహము మంచిదికాదు. అది కేవలము దుర్బలుల కొఱకు. యదార్థధార్మికు లెన్నడును వివాహమొనర్చుకొనరు. వారు పురుషులేయగుదురు గాక లేక స్త్రీలే కానీ ధార్మికులగు స్త్రీలు వచించునది, 'భగవంతుడు మాకు దానికంటె సమున్నతమగు సుయోగము నొసగినాడు, వివాహ మొనర్చుకొననేల? భగవంతుని పూజార్చనల సల్పుదును, మనుష్యుని కామింపనేల?' అవశ్యమందఱును భగవంతునికి మనస్సును సమర్పింపజాలరు. కొందరిటిపట్ల ఇయ్యది సంపూర్ణముగ అసంభవము; అందువలన వారు కష్టము ననుభవింతురు. కాని, తక్కినవారు వీరి కొఱకు అవయనేల? ఇప్పుడు మీరు విచారింపుడు. కాని, భారతవర్షముయొక్క అభిప్రాయ మియ్యది.

ఇప్పుడు మేము నారియొక్క కన్యావస్థను గుఱించి ఆలోచింతుము. హిందువుల సంసారమున కన్యను గుఱించియే అన్ని ఇబ్బందులు కన్యా, వర్ణము-ఈ రెండును హిందువుల సర్వనాశన మొనర్చును. ఏమన, వారి కొకే వర్ణమున, మరల నందు ఉపయుక్తశాఖతో వైవాహిక సంబంధ మొనర్పవలసియుండును. అందువలన, ఆడపిల్ల వివాహమొనర్ప తండ్రి అనేక సమయముల 'బికారి'యగును. వరుని తండ్రి వీలును గ్రహించి, వధువుయొక్క తండ్రి సమకూర్ప, అంతయును కోలుపోవునంత, కట్నము నడుగును. హిందువుని జీవితమున కన్యను గుఱించియే సమస్యలన్నియు. ఇంకొక విషయమును మీరు లక్షింపుడు. సంస్కృతమున ఆడపిల్లను 'దుహిత'యందురు. శబ్దముయొక్క వ్యుత్పత్తి ఇయ్యది పురాణకాలమున పరివారమున ఆడపిల్లయే గోదోహన మొనర్చెడిది. అందువలన, దోహార్థకమగు 'దుహ్' ధాతువునుండియే దుహితృ శబ్దము వచ్చినది. దుహితృశబ్దము ప్రకృత పక్షమున గోదోహన కారిణినే తెల్పును. కాని తరువాత గోదోహనకారిణి

దుహితృ శబ్దమునకు నూతన అర్థము సృజింపబడెను. దాని ద్వితీయ అర్థము, సంసారమునందలి సారపదార్థమును దోహన మొనర్చునదని.

సంఘమున ఇయ్యవి భారతీయనారియొక్క విభిన్న సంపర్కములు. మాతయొక్క స్థానము సర్వోన్నతము, తరువాత భార్యది, పిదప దుహిత అని నేను మీకు చెప్పియే యుంటిని. ఈ విభాగములన్నియును కడుంగడు జటిలములు, దుర్బోధ్యములు. చాల ఏండ్లు ఆ దేశమున వసించినను విదేశీయుల కయ్యవి బోధపడుట చాల కష్టము.

మేము గురుజనుల సమక్షమున భార్యతో మాట్లాడము. కేవలము చిన్నవారి ఎదుటను ఏకాంతమునను సంభాషింప జెల్లును. నేను వివాహితుడైన కేవలము చెల్లెలు తత్సంతానము ముందరనే భార్యతో సంభాషించెడువాడను. సోదరితో ఆపె భర్తను గుఱించి ఏమియు మాట్లాడ చెల్లదు. సంగతి ఇయ్యది. మేము సన్యాసులజాతియను అభిప్రాయము నిరంతరము సమస్త సంఘముయొక్క ఎట్టఎదుట కనంబడుచున్నది. వివాహ 'మొకింత అపవిత్రము, ఒకింత నికృష్టము అని జనుల అభిప్రాయము. అందువలన ప్రణయ-విషయముల గుఱించి ఏవిధముగనైన సంభాషింపగూడదు. మా జ్యేష్ఠ-సోదరీసోదరులు, మాత లేక తదితర గురుజనుల ముందర ఏదైన ఒక నవలనుగూడ చదవగూడదు; వారెవరైన ఎదుటకు వచ్చిన దానిని మూసి వేయవలెను.

అన్నపానముల విషయముగూడ ఇట్లే; గురుజనుల ముందు మేము తినము. స్త్రీలుగూడ పిల్లలు, లేక సంపర్కమున తమకంటె చిన్నవారి ముందుగాక, తదితర పురుషుల ముందు తినరు. స్త్రీలు నుడువునది, 'భర్త ఎదుట కరకర నమిలి మ్రింగుటకంటె, మరణము మంచిది.' కొన్నిపట్ల సోదరీసోదరులు కలసి భుజింపవచ్చును. నేనును నా సోదరియును భుజించుచుంటి మనుకొనుడు. అప్పుడు హఠాత్తుగ ఆపె భర్త ద్వారమున నిలబడిన, వెంటనే ఆపె భోజనమును నిల్పును, భర్తగూడ తొందరగ అటనుండి వెడలిపోవును.

ఈ ఆశ్చర్యాతి ఆశ్చర్యకరములగు ఆచారములన్నియు, ఆదేశపువి; వీటియందు కొన్నిటిని నే నవివాహితుడనగుటవలన స్త్రీ విషయకములగు విషయముల సంపూర్ణముగ నెఱుంగను. మాత, సోదరీవిషయముల నెఱుగుదును. ఇతరుల భార్యల విషయము కొంచెము చూచితిని; దీనినుండియే నేను గ్రహించిన విషయముల నన్నిటిని మీకు జెప్పుచున్నాడను.

విద్యాసంస్కృతులు సంపూర్ణముగ పురుషునిమీదనే నిర్భరపడుచున్నవి. అనగా, పురుషులు ఉన్నత విద్యను బడసినచోట స్త్రీలుగూడ బడయుచున్నారు. పైగా, పురుషులు విద్యను బడయనిచో, స్త్రీలుగూడ బడయరు. హిందువుల ప్రాచీనరీతి ననుసరించి పూర్వమునుండియు, భూమి సాధారణ-సంపత్తిగ పరిగణింప బడుచున్నది; మీ భాషలో నయ్యది సర్కారువారిది. భూమిమీద ఎవ్వటికిని వ్యక్తిగతమగు హక్కు లేదు. భారతమున భూమిపన్నే రాజస్వము. అక్కడ ప్రతివ్యక్తియు సర్కారువారినుండి భూమిని బొందును. భూమిమీద ఎవ్వటికిని వ్యక్తిగతమగు హక్కు లేదు......

మీలో హెర్బర్టు స్పెన్సర్ పుస్తకముల జదివినవారు మఠ—శిక్ష (Monastery systen & Education) అననేమో ఎఱుంగుదురు. ఇది ఒకప్పుడు యూరప్‌న బరీక్షింపబడినది; కొన్నితావుల దీనివలన సుఫలమే ఫలించినది. ఈరీతి ననుసరించి ఒక పండితుని ఆధీనమున ఒకస్కూలు ఉండును. గ్రామవాసులు దాని ఖర్చును భరింతురు. ఈ పాఠశాలలు ప్రాథమికశిక్ష నొసగును. మా విద్యా—ఉపాయములన్నియును అత్యంత సరళములు. ప్రతి విద్యార్థియు కూర్చుండుటకు ఒక చిఱుచాపను దీసికొనిపోవును. మొదట లేఖన-పత్రములు తాటియాకులు. ఏమన, కాగితములు, వారి పక్షమున, అధికమూల్యములు. ప్రతి విద్యార్థియును చాపనుబరచి కూర్చొని, తన సిరాబుడ్డిని, పుస్తకమును వెలికిదీసి, వ్రాయుట నారంభించును. పాఠశాలలో లెక్కలు, కొంచెము సంస్కృత వ్యాకరణము, సామాన్యభాష చెప్పబడును. (సశేషము)

# పాత పాటలు

[ప్రాచీనుల పాండిత్య ప్రతిభ, కవిత్వనైపుణి ప్రబంధాది రచనలలోనే గాక, పల్లె పాటలు, పద్యములలోకూడా అమితముగా నున్నది. ప్రబంధ రచనలవలె నివి గ్రంథస్థములుగా లేని కారణము చేతను, వాడుకలో మాత్రమే నిలిచియుండుటచేతను, యివి నశించిపోకుండ సేకరించుట ఎంతయు మన ధర్మము. ఇట్టి వాటిని సంపాదించి పంపిన కృతజ్ఞతతో 'గృహలక్ష్మి' ప్రకటింపగలదు.]

## శ్రీ లక్ష్మీగౌరుల సంవాదము

గౌరిదేవి నీ శంభునిగళమున నలుపేమమ్మా
నారీమణి విష్ణుదేవుడు నలుపుగాడటె యేకొమ్మా ॥ ౧ ॥

పంకజాక్షి నీ శంకరు కరమున జింకలున్న వేమమ్మా
శంకలేక నీ వనమాలి జింకనేసెనె యోకొమ్మా ॥ ౨ ॥

ఇందువదన నీ వల్లభునికి సగమాడరూప మేమమ్మా
ముద్దుగొమ్మనీ పెన్మిటి మును మోహినిగాడటెయో కొమ్మా ॥ 3 ॥

పార్వతిదేవి నీ విభునిపై పాములున్న వేమమ్మా
క్షేత్రతనయనీ మురహరి మానుగాడటెయో కొమ్మా ॥ ౪ ॥

ఎగ్గులేక నీకాంతుడు జగమున భిక్షమెత్తుటేమమ్మా
పంతముతో బలిచక్రవర్తి నడుగలేదటెయో కొమ్మా ॥ ౫ ॥

సిగ్గులేక నీ పెనిమిటి ముసలెద్దు నెక్కుటేమమ్మా
పన్నగశాయి రేపల్లెవాడలో పసువులగాయడె యోకొమ్మా ॥ ౬ ॥

పార్వతి లక్ష్మిదేవుల వాదులు పలుకులయినవేమమ్మా
విన్నవారికి విష్ణులోక కైలాసమ్ము లబ్బునె యోకొమ్మా ॥ ౭ ॥

—ఒంగోలు వేంకటరంగయ్య

# చలన చిత్రాలు

## నవ్యకళ కాంతులకీ, నవనవోజ్వల భావరూపానికి ఆటపట్టు నవ్యకళావారి 'మీరాబాయి'

విడుదలయ్యై ఆంధ్రదేశమునందలి ముఖ్యపట్టణాలలో ప్రదర్శింపబడుతూ వుంది. దర్శకులు శ్రీ భీమవరపు నరశింహారావుగారి కళారాధన కిది బాహ్యరూపం.

చిత్రము ప్రతి అంగుళంలోనూ కళాప్రాభవం ఉట్టిపడుతోంది. హృదయాన్ని భక్తిరసంలో తన్మయత్వం చెందించే గానం, నాటికాల పరిస్థితులను రూపుపెట్టిన శిల్పము యీ చిత్రంలో సృష్టింపబడినంత నిర్దుష్టంగా మరి ఏ చిత్రంలోను లేదంటే అతిశయోక్తిగాదు.

నటీనటకులందరు చక్కగా నటించడంచేత, చక్కని నడకలో చిత్రాన్ని నడిపిన దర్శకత్వంచేత 'మీరాబాయి' తెలుగు సినీమా పరిశ్రమలో నూత్న శకారంభాన్ని చూపించింది.

## ఫేమస్ టాకీసువారి 'భూకైలాస్'

గత 14 వ తేదీని విడుదలయ్యై ఆంధ్రదేశమంతటా విజయయాత్రలు చేస్తూవుంది. అనేక సాంఘిక చిత్రాల మధ్యలో యీ పౌరాణిక చిత్రం రావటంవల్ల, కథ సర్వజనవిదితమైనదైనందువల్ల విశేష జనాదరణ పొందుతూవుంది. నటీనటులు క్రొత్తవారైనా చక్కగా నటించారు. ఆంధ్ర కర్ణాటక దేశాలలో ఒకేసారి విడుదలై ఆదరింపబడుతూ వుంది.

## ఫేమస్ ఫిలిమ్సువారి 'ధర్మపత్ని'

ప్రాతివ్రత్యమహిమను వేనోళ్లచాటే చక్కని సామాజిక గాథ దీనికి ఇతివృత్తం. సిద్ధహస్తులు శ్రీ పి. పుల్లయ్యగారి దర్శకత్వంలో తయారైంది. యీ మాసంలో విడుదల ఔతుంది. శ్రీమతి శాంతకుమారి, భానుమతిగార్ల గానమాధుర్యం దీనిలో వెల్లివిరిసింది అనివార్తలు.

## రోహిణి పిక్చర్సువారి 'తెనాలి రామకృష్ణ'

శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానకవిచంద్రుడైన తెనాలి రామకృష్ణుని చరిత్ర క్రొత్త పక్కీలో సృష్టింపబడుతూ వుంది. కేవలం అల్లరి చిల్లరి పనులుచేసే ఒక ఆకతాయిగా నిర్వచింపబడే రామలింగణ్ణి, ఒక సంఘ సంస్కర్తగాను, పేదలపాలిట పెన్నిధిగాను సృష్టిస్తున్నారు శ్రీ హెచ్. ఎం. రెడ్డిగారు—ఓవైపు షూటింగు, ఓవైపు ఎడిటింగుకూడా అతిశీఘ్రంగా జరుగుతున్నాయి. యీ మాసాంతంలోగా విడుదలౌతుంది.

## శ్రీ వసుంధరా ఫిలిమ్సువారి 'మైసూరు దసరా'

ఈ వార్తాచిత్రానికి ముందుగా తమిళనాడులో విడుదలయ్యే ఏర్పాట్లు జరిగినవి. యీ మాసాంతంలోగా విడుదల ఔతుంది. తెలుగులోను, తదితరభాషల్లోను కూడా తయారయి సిద్ధంగా వుంది. దర్శకులు శ్రీ గాలి వెంకటేశ్వరరావుగారు దీని వెనువెంటనే మరికొన్ని వార్తాచిత్రాలను, ఒక సాంఘిక, పౌరాణిక సమ్మేళన చిత్రాన్ని తీయబోతున్నారు. దానికి సంబంధించిన వ్యవహారమంతా చురుగ్గా జరుగుతూవుంది.

## ఆర్. యస్. పి. పిక్చర్సువారి 'తారాశశాంకం'

షూటింగు పూర్తిగా అయిపోయింది. ఎడిటింగు జరుగుతూవుంది. పుష్పవల్లియొక్క హావభావ నటనాకౌశలానికి యీ చిత్రం చూచితీరాలి.



## గోధుమలుతో తయారుచేయదగిన వివిధ పదార్థములు—6.

### బొంబాయి చట్నీ

అరపడి పెరుగులో $\frac{1}{2}$ తులం మిరపకాయలు $\frac{1}{4}$ తులం ఆవాలు కొంచం మెంతులు శెనగగింజంత ఇంగువ 6 పచ్చిమిరపకాయలు తరిగి, కొంచం కర్వేపాకు 2 తులముల జీడిపప్పు నేతిలో వేయించి వెయ్యవలెను. 2 ఆళాకుల గోధుమరవ నేతితో ఎర్రగా వేయించి పెరుగులో కలుపవలెను. 4 తులముల కొబ్బరి వేయించి కలుపవలెను.

### బెంగుళూరు బోండా

ఒక పాత్రలో కొంత నెయ్యివేసి 2 ఎండు మిరపకాయ ముక్కలు, 4 పచ్చిమిరపకాయ ముక్కలు, చంచా ఆవాలు, 2 చంచాల మినపపప్పు, 1 చంచా శనగపప్పు, కర్వేపాకు, వుల్లిపాయ ముక్కలు వీటిని అన్నింటిని వేయించి 2 ఆళాకుల నీరుపోసి కాగినతరువాత 1 ఆళాకున్నర నూకనువేసి కలియపెట్టి గోధుమనూక వుడికినతరువాత దింపి 4 తులముల నెయ్యివేసి చిన్నవుండలు చేయవలెను. ఒక ఆళాకు గోధుమ పిండి, అర ఆళాకు శనగపిండి కొంచం కొట్టిన కారం, వుప్పునీటితో చిక్కగ కలిపి వుండలు పిండిలోముంచి మరగిన నేతిలోవేసి వేయించి తీయవలెను.

### దోస అట్లు

ఒక దోసకాయను తరిగి గింజలుతీసి చిన్నముక్కలు చేయవలెను. ఒక ఆళాకు గోధుమరవ దోస ముక్కలతో 2 గంటలు తడిపివుంచి, తరువాత మెత్తగా రుబ్బి, 2 పచ్చిమిరపకాయలు, కొంచం అల్లం, కొంచం వుప్పు కొట్టి పిండిలో కలిపి అట్లు పోయవలెను.

### పాలకోవా

1 శేరు పాలు 2 గంటలు మరగనిచ్చి $\frac{1}{2}$ శేరు పంచదార, $\frac{1}{4}$ శేరు గోధుమపిండివేసి గట్టిపడేవరకు కలుపవలెను. తరువాత దింపి పళ్లెంలో పెట్టవలెను.

### వెన్న ద్రాక్షపళ్లు

$\frac{1}{4}$ శేరు గోధుమపిండి 4 తులములవెన్న $\frac{1}{4}$ శేరు పంచదార చిన్నచంచా ఏలకపొడి వీటినిబాగా కలిపి ద్రాక్షపళ్లవలెచేసి నేతిలో వేయించవలెను.

## గోధుమ చౌచౌ

½ శేరు గోధుమలు వేయించి విసిరి ఒక కొబ్బరికాయ కోరి వేయించి, ½ శేరు పంచదార ½ తులం ఏలకపొడి, 4 తులముల జీడిపప్పు వేయించి, 1 ఫలం కిస్‌మిస్ 1 ఫలం బాదంపప్పు, 4 తులముల నెయ్యి కాచి మొత్తం అన్నీ కలుపవలెను.

## గోధుమ వడలు

¼ శేరు శనగపప్పు నానినతరువాత రుబ్బవలెను. దానిలో 1 అశాను గోధుమరవ కలిపి 4 తులముల వుల్లిపాయముక్కలు, 6 పచ్చిమిరపకాయ ముక్కలు, వుప్పు, జీడిపప్పు అన్నికలిపి బిళ్లలు చేసి కాగినచమురులో వేసి వేయించితీయవలెను.

## సొజ్జి బూర్లు

1 అశాను గోధుమరవ 3 అశానుల పాలలో వేసి వుడకపెట్టవలెను. దానిలో 1 అశాను పంచదార ఏలకపొడి వేసి, దింపి వుండలుచేసి వుంచవలెను. 1 అశాను గోధుమపిండి అరఅశాను వరిపిండి, కొంచంవుప్పు నీటిలో చక్కగాకలిపి ఒక పాత్రలో నెయ్యివేసి మరగించి పై వుండను పిండిలోముంచి నేతిలోవేయించి తీయవలెను.

## రవ కమలాలు

1 అశాను గోధుమరవ ½ అశాను పంచదార తగుపాలతో గట్టిగకలిపి 1 గంట నాననిచ్చి రోటిలో వేసి మెత్తగకొట్టవలెను. దానిని వుండలుచేసి పూరీవలె వత్తి ఒకపాత్రలో నెయ్యిపోసి మరగించి పూరీ వేయించవలెను.

## బెంగాలి ఫ్రూట్స్

పావు శేరు పెసరపప్పు నాననిచ్చి కొంచం మెత్తగ రుబ్బి ఇడ్లీ వండవలెను, వుడికినతరువాత దింపి పిసకవలెను. 1 కొబ్బరికాయ కోరి నేతిలో వేయించి కొంచం ఏలకపొడి, అర్ధ శేరు పంచదార వీటిని ఇడ్లీ పిండిలో కలిపి పొయ్యిమీద పెట్టి కలియపెట్టవలెను. 10 నిమిషములకు దింపి గచ్చకాయంత వుండలు చేయవలెను. పావు శేరు గోధుమపిండి పావు శేరు వరిపిండి చిటిక కొట్టినవుప్పు నీటితో పెరుగువలెకలిపి, ఒక వెడల్పు పాత్రలో ½ శేరు నెయ్యిని మరగనిచ్చి వుండలను పిండిలోముంచి నేతిలో వేయించి తీయవలెను.

—సి. హెచ్. అన్నపూర్ణాబాయి

## బంగారుపతకం బహుమానం

గోధుమ ధాన్యముతో చేయదగిన పలువిధములైన పదార్థములను, గత సంచికల లోని అయిదు పట్టీలయందు ప్రకటింపబడినవి గాక, ఎక్కువ పదార్థములను వ్రాసి పంపినవారికి ఒక 'బంగారుపతకము' బహూకరింపబడును. వెనుక గృహలక్ష్మిలో ప్రకటింపబడిన వాటినిగూడ ఎత్తి వ్రాయగూడదు.

సంపాదకుఁడు.

# పుష్ప చయము * * *

## స్వాతంత్ర్యం ప్రధానంగాని, వారసత్వ, విడాకుల హక్కులుగాదు

శ్రీమతి క్రాంతిదేవి ఇటీవల గ్వాలియర్‌లో ఒక మహిళాసభకు అధ్యక్షతవహించి, మహిళా సంఘాలచర్యలు సత్యమునకు దూరమైపోతూ వున్నాయని, దూరదృష్టి రాహిత్యములవుతున్నాయని, మహిళోద్యమాలను గురించి ఒక చిన్న హెచ్చరిక గావించారు. ఆమె చెప్పిన విషయాలనుగురించి మహిళాసంఘాల్లో తీవ్రమైన అలజడికలిగి, అనేకమైన విమర్శనలు బయలుదేరాయి. ఆ విమర్శనలన్నిటికి సమాధానంగా శ్రీమతి క్రాంతీదేవి యీవిధంగా సమాధానం ఇచ్చారు:

"నేటి కాలపు కాలేజి విద్యావిధానం ఒక క్రొత్తరకపు యువతులను తయారుచేస్తూవుంది. యీ తరగతికిజెందిన యువతీలోకం పురుషులతోడి సహకారాన్ని తృణీకరిస్తూ, కొంతమంది ధనికురాండ్ర చేతుల్లో మెలుగుతూ, పాశ్చాత్యపద్ధతులను గ్రుడ్డిగా అనుసరిస్తూ, స్వదేశ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనడానికి నిరాకరిస్తున్నారు.

స్త్రీ జనోద్యమము, దాని నిజమైన ఆకారంలో, మానవసంఘానికంతకు చెందినదై వుండాలి. ఇది ఎంతసేపూ స్త్రీ పురుషులయొక్క రాజకీయ, ఆర్థిక, సాంఘిక పురోభివృద్ధికి దోహదమిచ్చునదిగానే వుండాలి. స్త్రీ నాయకురాండ్రు సాధారణ తరగతికిచెందిన స్త్రీలయొక్క నిజమైన ప్రతినిధులుగావుండాలి. అదే సాధారణ స్త్రీలకొరకై సాధారణ స్త్రీలచే నడపబడు సవ్యమైన సాధారణస్త్రీ జనోద్యమము కాగలదు.

నేటి మహిళోద్యమము "భారతదేశ స్వాతంత్ర్యమే ప్రధానాశయం" అనే విప్లవవంతమైన పట్టుదలతో నడపబడుతూ వుందా? కాక బాధ్యతారహితమైన కులాసాలకోసం సంస్కరణల తీసుకురావాలనే స్త్రీ నాయకురాండ్రయొక్క తత్వాలకిది ప్రత్యక్షమైన బాహ్యరూపమా?

స్త్రీలజాతీయోప సంఘంవారు ఇటీవల శాసన సంబంధమైనవాటిలో, సంస్కరణలు కావాలని తీర్మానాలుచేశారు. కాని, మనదేశ పరిపాలన పరాయత్తమై వున్నంతకాలము అటువంటి తీర్మానాలు కేవలము మన అభివృద్ధి నిరోధకాలనివారు ఆలోచించలేదు.

ప్రస్తుత కాల పరిస్థితుల్లో, మహిళోద్యమము నిజమైన, తీవ్రతరమైన ఉద్యమంగా మారాలంటే, యీ ఉద్యమంయొక్క దృక్పథం రాజకీయంగా మారిపోవాలి. కాక, కేవలము ఆచరణ రహితమైన (పుట్టిన మరుక్షణంలోనే చచ్చేవి) తీర్మానాలను తీర్మానించుటలో నమ్మకమున్నంతకాలము నేటి మితవాదపక్షంవలెనే, మహిళోద్యమంకూడా మృతినొందిన దానితోటే సమానమౌతుంది.

మధ్యతరగతి మహిళామణులు, కార్మిక కర్షక స్త్రీలు ధనముగాని, సౌఖ్యముగాని, చివరకు తీరుబాటుగాని లేకుండా కాలం వెళ్లబుచ్చుతున్నారు. కనుక ప్రకృతిసిద్ధంగా వారికి వారసత్వపు హక్కుయందుగాని, భర్తలను విడాకులిచ్చుటయందుగాని, భోగలాలసత్వ సంబంధమైన కోరికలుగాని కలుగవు. ప్రతిదినమూ రెండు పూటలా భోజనం సంపాదించుకోవడమూ, చలి, ఎండ బాధలనుండి కాపాడుకోవడానికి బట్ట సంపాదించుకోవడము—వారిని ఎల్లప్పుడు ఎదుర్కొనే సమస్యలు.

ఇక, సహజంగా భోగలాలసులైన ఐశ్వర్యవంతురాండ్ర దృష్టిలో సాధారణ స్త్రీలయొక్క కష్టనిష్ఠురాలు అత్యల్పమూ, అనవసరమే కాక, వారి ఆలోచనలకు అందవు కూడాను."

## నంద్యాలలో వితంతుశరణాలయ నిర్మాణ ప్రయత్నాలు

నంద్యాల వైశ్య మహిళా సంఘంవారు శ్రీమతి ఎలకూరు సుబ్బరత్నమ్మగారి అధ్యక్షతను సమావేశమై వితంతు శరణాలయము నొకదానిని నంద్యాలలో స్థాపించునట్లుగా తీర్మానం గావించారు.

## తల్లిపాలయొక్క శ్రేష్టము

శిశువులకు తల్లిపాలవంటి శ్రేష్టమైన పాలు ఇంకొకటిలేవు. తల్లిపాలమీద పెరిగిన శిశువు వర్ధిల్లినట్లు పోతపాలు త్రాగిన శిశువులు వర్ధిల్లరు. తల్లిపాలు పిల్లలకు స్వాభావసిద్ధమైన ఆహారము. సాధువులగు ఆవు, మేక మొదలగు జంతువులును, క్రూరములగు పులి, సింహము మొదలగు మృగములలో తల్లులు పిల్లలకు పాలుగుడిపియే పెంచుతున్నాయి—ఇదియే మాతృధర్మం.

కొన్ని కారణములచేత తల్లికి పాలు లేకపోవచ్చును. అలాంటప్పుడు తల్లికి పాలుపడడానికి తగిన సదుపాయాలు చేయవలయునేగాని పిల్లలకు పోతపాలు అలవాటు చేయరాదు.

### తల్లికి పాలుపడేందుకు కొన్ని సదుపాయాలు

(1) బార్లినీళ్లు కొద్దిగా పంచదారవేసి మితముగా పుచ్చుకుంటే పాలు వృద్ధియగును.
(2) శుభ్రమైన ఆవుపాలు జీర్ణింపదగినంత పుచ్చుకొనవచ్చును.
(3) నీళ్లలో నానబెట్టిన పచ్చిశనగలు తగుమాత్రం తినవచ్చును.
(4) కర్జూజాపండు తినడంవల్ల—
(5) వెల్లుల్లి పాలలో ఉడికించి తినడంవల్ల—
(6) ముల్లతోటకూర, పప్పువేసివండి తినడంవల్లను పాలుపడతవి.

మరియు తల్లికి పాలపుష్టి అధికమై దాన్ని జీర్ణించుకోలేని శిశువులుకూడ ఉంటారు. అలాంటప్పుడు కూడ పిల్లలకు పోతపాలు అలవాటు చేయకూడదు. ఆతల్లిపాలు సులభంగా జీర్ణంచేసే మార్గమునే చూడాలి. తల్లి పాలుగుడుపుటకు ముందు 3 లేక నాలుగు చమిచాలు గోరువెచ్చని నీటిని శిశువునకు త్రాగించి తరువాత తల్లిపాలిస్తే త్వరలో జీర్ణమగును.

## స్త్రీ విద్యలో అభివృద్ధి సూచన

మద్రాసు రాజధానిలో స్త్రీల విద్యాభివృద్ధి సంబంధించిన కొన్ని అంకెలను గమనిస్తే, వెనుకటికంటె ఇప్పుడు స్త్రీలలో విద్యాసక్తి ఎక్కువగా కలుగుతూవుందని చెప్పవచ్చు. ఆంధ్రరాష్ట్ర హరిజన సేవక సంఘ ప్రధానకార్యదర్శి శ్రీ మాగంటి బాపినీడుగారు ఇటీవల తయారుచేసిన యిట్టిపట్టికను బట్టి చూస్తే—5 సంవత్సరములు నిండిన బాలురలో నూటికి ముగ్గురు వున్నట్టయితే బాలికలలో 2½ వరకు వున్నారు. క్రైస్తవులలో మాత్రము 14 గురువరకు వున్నారు.

ఇవిగాక, నిమ్నజాతి బాలికలు మద్రాసు రాజధానియందున్న అన్ని స్కూళ్లలోను చదువుచున్నవారు 75,935 వరకు వున్నారు. మొత్తముపైన విద్యావతులు 962,437 వరకువున్నారు. ఇవి గడచిన సంవత్సరములలో కంటె చాలా అభివృద్ధిలోవుంది. దీనిని ఇంకా వృద్ధిచేయాలని ప్రబల ప్రయత్నాలు జరుగుతున్నాయి. హరిజనబాలికలలో ఉన్నతవిద్యాభివృద్ధికొరకు ఆసక్తి ఎక్కువగా వున్నదని, వారికి వస్తూవున్న అర్జీలన్నిటిని తీసుకొనలేక పోతున్నామని కార్యదర్శిగారు తెలియజేస్తున్నారు. హరిజనులలో విద్యాభివృద్ధికోసం యీ సంవత్సరం బిర్లా కోటీశ్వరుడు ఒకలక్ష రూపాయలను విరాళంగా ఇచ్చారు. ప్రజానీకంకూడా కొంచెం శ్రద్ధవహిస్తే ముఖ్యంగా స్త్రీలలో ఆవిద్యను రూపుమాపవచ్చును.

# గ్రంథ సమీక్ష

## సరస్వతీ రామాయణము

శ్రీ సరస్వతీ రామాయణమునంతయు పూర్తిగ నవధానముతో జదివితిని. శైలియు, పదముల కూర్పును బహు మనోహరముగనున్నవి. చదువుచుండగ నెచ్చటను కొతుకుబడలేదు. కొన్నిపుటలుచదివి ఆనాటి కక్కడకి నిలుపుటకు బుద్ధియొప్పక కాండాంతమువరకైన చదువ ప్రేరేపించుచుండినది. గట్టిపడిన ఇనుపకమ్ముల రైలుమార్గమున మెయిలు ట్రెయినుపరుగిడినట్లు గ్రంథము నడచినది.

గుణదోషవిచారముజేయ నేనధికారినిగాను. నాకుతోచిన కొన్నికొన్ని విషయముల గ్రంథమునందు యందంద ఆమె ఘట్టములలో పైనక్రింద ప్రక్కన వ్రాసియుంచితి. నాదురూహలను దుష్టటిప్పణములను శ్రీమతిగారికి కనుపరచి దిద్దించుకొను ఆశకలదు నా పుస్తకము తిరుగ నాకు జేరగలుగనేని దాని తమ సమక్షమునకు బంప కోరికగలదు.

శ్రీరామకథ నాలంబనముజేసికొని ఈ గొప్ప కవయిత్రి అష్టాదశవర్ణనలతోటి గొప్ప కావ్యమును నిర్మించినది. ప్రబంధలక్షణములన్నియు నిందున్నవి. ఉత్తరకాండమును సాధారణముగ ననేకులు చదువరు. వనవిహార జలక్రీడాది శృంగారవర్ణనలతో దాని నీకవి రమ్యతమము జేసినది. శ్రీరామకథ శుభాంతముగాక పోవుటకీయమ యుత్తరవాదిగాదు. "రామోరామోరామ ఇతి ప్రజానామభవన్ కథాః। రామభూతం జగదభూద్రామేరాజ్యం ప్రశాసతి" యను యుద్ధకాండాంత శ్లోకముతో వాల్మీకి సంహిత ముగిసినదని కొందరి యభిప్రాయమైయున్నది.

ఈ యమనడపిన విధానముజూడగ కేవలముగ శ్రీ వాల్మీకి ప్రోక్తమునే యాశ్రయించినటుల లేదు - భేదము లనేకములగుపడుచున్నవి. నాకుతోచినవరకు నా పుస్తకమునవ్రాసితి. కొన్నిటి నిందు విన్నవించెద :—

1. రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నలుగురును ఒకేలగ్నమునబుట్టినట్లు సరస్వతీ రామాయణమును వదించుచున్నది. (బాలకాండ 21 పుట-ఈ వచనము) ప్రాచేతసుడు శ్రీరామునికి కర్కాటలగ్నమును భరతునికి మీనలగ్నమును లక్ష్మణశత్రుఘ్నులకు కుళీరమును జెప్పుచున్నారు (బాలకాండసర్గ 18). మొల్లయు నీమె వ్రాసినట్లే చెప్పినది.

2. శ్రీరామాదుల జననము ఆదివారముననని యీమె జెప్పినది. వారమును వాల్మీకి జెప్పలేదు. మొల్ల భానువారమనినది.

3. హనుమంతుడు లంకయందు రెండురాత్రులుగడపినట్లు ఈమె గ్రంథమున స్ఫురించుచున్నది. (సుందరకాండ 93 లేక 94 పుటలును) వాల్మీకి రామాయణమునుబట్టి యొక్కరాత్రియని తోచుచున్నది.

4. శుక్రాచారి ప్రశంస వాల్మీకి యుద్ధకాండమునలేదు. ఈమె యుద్ధముననున్నది (ఇదియు మొల్ల రామాయణముననున్నది) (పుట 184) ఇత్యాదులు.

అయోధ్యాపురవర్ణనము జేయుటలో నీమె బ్రహ్మ క్షత్రియ వైశ్యులమాత్రము బేర్కొని మిగిలిన వర్ణమును సామాన్యముగ ప్రజాశబ్దమున జేర్చినది ఏలనో? (బాలకాండ పుట 121)

వాల్మీకి నారదమహర్షి వలన శ్రీ రామాయణకథను వినినట్లు ఆమె కాండాంతములందును ఆవలి కాండల ప్రారంభమునను గలదు. అరణ్యకాండ కడభాగమున (పుట 71) 'నారదుండటమీఁది వృత్తాంతంబు వినఁగోరిన'యను మాటలవలన వినగోరినది నారదుడని సంశయమున కవకాశమగునట్లున్నది. ఇది యచ్చులోని పొరపాటుగ నుండునేమో? మొల్లరామాయణమునకన్న నిది పెద్ద గ్రంథముగనున్నది :—

| | మొల్లరామాయణము | | | సరస్వతీ రామాయణము |
|---|---|---|---|---|
| బాలకాండ | 125 | గద్యపద్యము | | 137 |
| అయోధ్యా | 40 | | | 61 |
| అరణ్య | 72 | | | 78 |
| కిష్కింధా | 35 | | | 49 |
| సుందర | 248 | | | 225 |
| యుద్ధ ఆశ్వాసము (1) | 122 | | యుద్ధ పూర్వభాగము | 173 |
| ,, (2) | 92 | | ఉత్తరభాగము | 165 |
| ,, (3) | 136 | | | |
| ఉత్తర కాండ | లేదు | | | 190 |
| | 870 | | | 1078 |

ఏలకో మొల్ల యుద్ధకాండమును మాత్రము మూడాశ్వాసములు జేసినది. శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి రెండు భాగములుగా విభజించినది.

పాటలు యక్షగానములుగాక కావ్యరూపమున ముగ్గురు స్త్రీలు శ్రీరామకథను జెప్పినట్లున్నది. మొదటిది మొల్ల - ఇక మనకాలమున శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారి వచనరూపమునను శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు గద్య పద్యాత్మకముగను వ్రాసిరి. మూడు గ్రంథములును ముచ్చట గొల్పుచున్నవి. వాల్మీకి రామాయణమునంతయు మనకాలమున ముగ్గురు ప్రత్యేక ప్రత్యేకముగ ఆంధ్రీకరించిరి - (1) బ్రహ్మశ్రీ గోపీనాథం వెంకటకవిగారు (2) బ్రహ్మశ్రీ ఆంధ్రవాల్మీకి వా. సు. దాసుగారు. బ్రహ్మశ్రీ కావ్యతీర్థ జనమంచి శేషాద్రిశర్మ కళాప్రపూర్ణులు. ఇట్టి రచనలుజూడ నాటికిని నేటికిని లోకప్రియుడగు మహాపురుషుడు శ్రీరాముడుగనే యున్నాడు. ఇట్టి యుత్తమపురుషుని చరిత్రమునువ్రాసి శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి కీర్తి వహించినది. స్త్రీల విద్యాభివృద్ధికిని చాల ప్రోత్సాహకరముగ నుండగలదని సంతసించెద.

—ఒంగోలు వెంకటరంగయ్య.

## కమలాకరము

కర్తలు: శ్రీ వారణాసి వెంకటేశ్వరులు, శ్రీ చివుకుల ఆదినారాయణగార్లు. సాహిత్యకుటీర ప్రచురణ. సభ్యులకు పావలా, ఇతరులకు ఆరు అణాలు. చిరునామా: గొట్టిపాడు, చిలకలూరుపేటపోస్టు.

ఇందులో ఇరువురిచేత రచింపబడిన నాటికలు, పద్యాలువున్నాయి. ఇదివరలో 'గృహలక్ష్మి' మొదలైన పత్రికల్లో ప్రకటింపబడ్డవాటిని సంపుటీకరించి కమలాకరమనేపేరుతో ప్రకటింపబడ్డాయి. రచయితల రచనలలో స్వతంత్రభావాలు, సంఘంలోని తెలివితక్కువల్ని చక్కగా విమర్శించేశక్తి బాగా ప్రస్ఫుటమౌతూ వున్నాయి. ఇటువంటి గ్రంథాలే యీ గ్రంథమాలనుండి ఇంకావిరివిగా వెలువడుతాయని ఆశిస్తాము.

## పత్రికా పరిచయం

### తిలోత్తమ

కర్త: శ్రీ చిలకమర్తి లక్ష్మీనరశింహంగారు, రాజమండ్రి. ప్రకాశకులు: ది మాడరన్ పబ్లిషింగు హౌసు, మెయిన్ రోడ్డు రాజమండ్రి. వెల రు. 0-12-0.

ఇది ఐదంకముల నాటకము, శ్రీ లక్ష్మీనరసింహంగారి కవితా నైపుణినిగురించి మేమిప్పుడు క్రొత్తగా తెలుపనక్కరలేదు. ఈ పౌరాణికనాటకంలో శ్రీ వారి రచనాప్రాభవం ఇతోధికమైంది.

ఇవేకాక, శ్రీ లక్ష్మీనరశింహంగారు మరికొన్ని సాంఘిక నాటకాలనువ్రాసి నేటి సమాజ పురోభివృద్ధికి దోహదమును కల్పిస్తారని ఆశిస్తాము.

### మణిహారము

ఇది స్నేహలతాకవితాసంఘపు 66వ పుష్పము. గ్రంథకర్త: గంధం వెంకటనరసింహాచార్యులుగారు, కొల్లాపురము. ఈ కవి అందంబులగు కందంబులతో నీ మణిహారమునుగూర్చి జటప్రోలు సంస్థానము యువరాజులగు శ్రీ శ్రీ జగన్నాధరావు బహద్దరుగారికి సమర్పించి ధన్యుడైనాడు.

### యోగరత్నాకరము 1, 2, భాగములు

కర్త: ఆయుర్వేదభూషణ, పండిత శ్రీ యేటూరు శ్రీనివాసాచార్యులుగారు. నెల్లూరు. ఒక్కొక్క భాగము వెల రు. 4—8—0.

సంస్కృత యోగరత్నాకరమునకు ఇది అమృతకర వ్యాఖ్యానము. సంస్కృతములోనున్న యీ గ్రంధము విద్యాధికులకేగాని ఉపయోగపడదు. కాని శ్రీ ఆచార్యులవారి యీ కృషిఫలితముగ యీ తెలుగు వ్యాఖ్యానము అందరి యొక్క అందుబాటులోనుండగలదు. ఆయుర్వేదము అంతయు సంస్కృత భాషలో నుండుటవలన అది అందరికితెలియక, సరిగ ఉపయోగకారికాక నిల్చిపోయినది. కాని ఇటువంటి వ్యాఖ్యానము ఆయుర్వేదవైద్యాభివృద్ధికి ఎంతయు సహకారికాగలదు. ఇందుకు ఆచార్యులవారు ఎంతయు అభినందనీయులు. రెండు భాగములునుకలిసి సుమారు వేయిపుటలకుమించిన యీ గ్రంధము ప్రతివైద్యునివద్దను యుండదగినది.

## పత్రికా పరిచయం

### మాతృభూమి (సచిత్ర మాసపత్రిక)

సంపాదకులు క. సుబ్బారావుగారు, 143 వెంకటాచల మొదలివీధి, రాయపేట, మదరాసు. విడిసంచిక ఒకఅణా.

పత్రికచాలా అందంగావుంది. వివిధములైన వ్యాసాలతోటి, చక్కని కథలతోటి చూడ ముచ్చటగా వుంది. ముఖ్యముగా 'బట్టలు కట్టుకోవడం మానవజాతికి నేర్పినదెవరు' 'మనదేశంలో ఎక్కువగా పండే పత్తి రకేమిటి' మొదలైన విజ్ఞాన ప్రబోధకరమైన విషయాలు దీనిలో చాలావున్నాయి. ఎక్కువపేజీలు కలిగిన యీ పత్రిక విడి ప్రతి అణాగా నిర్ణయించి, అందరికి అందుబాటుగా వుండేటట్టు చేసిన సంపాదకుల ప్రయత్నం ప్రశంసార్హము.

## నాట్యకళ

సంపాదకులు శ్రీ కొత్తపల్లి లక్ష్మయ్యగారు. వి. పి. హాలు, మద్రాసు. సాలుచందా సభ్యత్వ రుసుముతో సహా రు. 3. విడి సంచిక పావలా. పోస్టేజీ అణన్నర ప్రత్యేకం.

వెనుక 3, 4 సంచికల వరకువచ్చి ఆగిపోయి, యిప్పుడు పునరుద్ధరింపబడింది. జీవస్ఫులింగాలు గోల్పోతూవున్న ఆంధ్ర నాట్యరంగాన్ని సంస్కరించి జాత్యౌన్నత్యానికి పాటుపడాలంటే యీ పత్రికను పోషించడం ఎంతయో అవసరము. వెనుకటివలెనే ఆంధ్ర మహాశయులు తమతమ ఆదరణను విరివిగా అందిస్తారని ఆశిస్తాము. విఖ్యాత రచనలతోటి, చక్కని చిత్రాలతోటి పత్రిక చాలా అందంగావుంది.

## చిత్రాంగి—క్రిస్‌మస్ సంచిక

ప్రఖ్యాత పత్రికా నిర్వాహకులు శ్రీ యస్. జి. ఆచార్యగారి సంపాదకత్వాన విజయయాత్రలు చేస్తూవున్న సచిత్ర మాసపత్రిక 'చిత్రాంగి' క్రిస్‌మస్ 'వేడుకల వారం'లో ఆంధ్ర మహాశయులకు వేడుక గూర్చడానికిగాను ప్రత్యేక సంచికగా వెలువడింది. మామూలు ఆకారంలో అత్యధికమైన పుటలతో, చక్కని ముఖచిత్రంతో 'చిత్రాంగి' చిత్రవిచిత్రంగా వుంది.

చిత్రాంగి పత్రిక పుటలను, ఎవరెవరిమీద వ్యంగ్యవిమర్శన విసురులున్నాయో అనే గుండె దడతోటే తిరగవేస్తారు. అయితే అభయం, అభిమాన పురస్సరమైన భక్తితోటేవుంటుంది గనుక, చిత్రాంగి పాఠకుల హృదయాలలో స్థిరస్థానం సంపాదించుకుంది.

ఈ సంచికలో వ్యంగ్య శీర్షికలు, చిత్రాలు, వ్యాసాలు ఇంకా ఎక్కువగా వుండడంవల్ల యీ అభిమానం ఇతోధికమై కావలసినంత ఉత్సాహాన్ని రేకెత్తిస్తుంది.

వన్నె విన్నాణాలతో ఇంత చక్కగా అలంకరించి చిత్రాంగిని క్రిస్‌మస్ వేడుక ఉపాయనంగా అణాఖరీదుకే సమర్పించిన శ్రీ ఆచార్యగారు అభినందనీయులు. చెల్లెలి పండుగ ముస్తాబు చూచి మురిసి, 'గృహలక్ష్మి' ఆశీర్వాదాల్ని అందజేస్తూవుంది.

# సంక్రాంతి

శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు

పచ్చపచ్చని తోరణపంక్తులెన్నో ద్వార బంధాలవెంట సొంపలరనుండ
రంగవల్లికలెల్ల హారంగునాప వచ్చె సంక్రాంతి, ప్రమదమ్ము పంచిపెట్ట!

ప్రణయపూజలనందు దేవాలయమ్ము వసుధనల్లుండ్ర పాలిటి భాగ్యరాశి
'వలపు' పాఠముబోధించు పంతులమ్మ ప్రేమజీవుల గాంచెడి ప్రియవచస్వి!

ముద్దరాలైన నెచ్చెలి, మోమువంచి 'సిగ్గు' సింహాసనాన నాసీనగాగ
అత్తమామల కానందమతిశయిల్ల అల్లుడయ్యను దెచ్చు, నీయాప్తురాలు!

బావగారిని పరిహాస వాక్యతతికి గురిగజేసిన మఱదళ్ల గొప్పతనము
వరునిజూడఁగ వధువులు పడెడిపాట్లు ముద్దుసంక్రాంతియేగదా! మూటగట్టు!

# యుద్ధరంగము

★ ఫ్రాన్సు వ్యతిరేకము
★ హిట్లరు విషమస్థితి
★ అమెరికా పాల్గొనునా?
★ జపాన్ బెదరింపు

— అరుంధతి —

మధ్యధరా సముద్రాధిపత్యముకొఱకై ముసోలిని గావించుచున్న ద్వంద్వయుద్ధములో గత మాసము నందు సంపూర్ణ పరాజితుడు గావలసివచ్చినది. గ్రీసు యుద్ధములో ఇటాలియను సైన్యములు తరుమబడు టయేగాని ఆక్రమించిన దింతవరకును ఏమియు లేదు. ఇటు ఈజిప్టురంగమున గ్రేజియానీ నాయకత్వముక్రింద ఇటలీ సైన్యములు 60 మైళ్లు లిబియా సరిహద్దులదాటి ముందుకు చొరుచుకొనిపోయి సిడిబరానీని ఆక్రమించి నవి. కాని బ్రిటిషు సైన్యములు ఆకస్మికముగ పైబడి 50 వేల ఇటాలియను సైన్యములను ఖైదీలుగా గొనుటయే గాక వారి ఆయుధ పరికరములన్నిటిని చేజిక్కించుకొన్నవి.

ఆ యీ పరాజయములవలన ఇటలీ ప్రజలలో తీవ్ర అలజడికలిగి ప్రభుత్వముపై తిరుగుబాటు కలుగు సూచనలు గాన్పించుటచే ప్రధానసేనాని బడాగ్లియోను తొలగించి, గ్రేజియానీని నియమింపవలసి వచ్చెను. ఈ మార్పు జరిగినను పరాజయములు ప్రబలముగ నుండుటచే జర్మనీ ఇటలీకి సహాయపడవలసి వచ్చుట తప్పని సరియైనది.

## ★ ఫ్రాన్సు వ్యతిరేకము

ఫ్రాన్సునందుగూడ హిట్లరు కనుకూలమగు పరిస్థితులు కన్పించుటలేదు. వీలైనచో పెటియన్ ప్రభుత్వమును ఇంగ్లండుపై యుద్ధమునకు దింపుటకుగాని, లేనిచో ఫ్రెంచి నౌకాబలమును తనవశ మొనర్చు కొనుటకుగాని హిట్లరు ప్రయత్నించుచున్నాడు. ఇందుకు వ్యతిరేకమగుటచే లావల్‌ను పదవినుండి పెటియిన్ సేనాని తొలగించుటయేగాక అతనిని అరెస్టుగూడ చేయించెను. కాని జర్మను రాయబారివలన అతడు విడుదల చేయబడినాడు. లావెల్ స్థానమున క్రొత్తగ నియమింపబడిన ఫ్లాండెన్‌కూడ జర్మనీకి అనుకూలుడు. ఈయదనునుగైకొని ఫ్రెంచి యుద్ధ నౌకాదళమును, వర్తకనావలను, ట్రూలన్ మొదలగు మధ్యధరా రేవులను జర్మనీ స్వాధీన మొనర్పవలసినదిగా పెటియను ప్రభుత్వమునకు జర్మనీ షరతులను పంపెను. దానిపై రెండురోజులు తీవ్ర చర్చలు సాగించి, పెటియను ప్రభుత్వము జర్మనీకోర్కెలను మన్నింప నసాధ్యమని తెలియజేసినది. దీనిపై జర్మనీ ఫ్రాన్సుతో ఎట్టిచర్యకు దిగునో చూడవలసియున్నది.

## ★ అమెరికా పాల్గొనునా?

ఇది ఇటులుండ అమెరికాకు రూజువెల్టు అధ్యక్షుడుగ ఎన్నుకొనబడిన తర్వాత అమెరికా ఇంగ్లండు వ్యవహారములలో అమితమైన మార్పుకలిగినది. వెనుకటి యుద్ధమువలెనే అప్పుగా గాక—బ్రిటనుకు ఆయుధములును, నౌకాబలమును ఎరువుగా ఇచ్చుటకును, యుద్ధానంతరము వాటిని తిరిగి అమెరికాకు ఇచ్చివేయునట్లును, యుద్ధములో శిథిలమైనవాటి ఖరీదు చెల్లించుటకును అమెరికా నిశ్చయించినది. అదియునుగాక, అమెరికా రేవులలో పరాజిత, అక్సిసురాజ్యముల నౌకాబలమునుగూడ స్వాధీనముజేసికొని వాటినిగూడ బ్రిటనుకు

ఇచ్చునట్లుగూడ రూజువెల్టు సభాపతి ప్రకటించినాడు. ఇది జనవరి 3వ తారీఖున సమావేశముకానున్న యునైటెడ్ స్టేట్సు కాంగ్రెసువారు ఆమోదించవలసియున్నది.

ఇది జర్మనీ-ఇటలీ-జపాన్ (ఆక్సిసురాజ్యములు)లకు అమిత ఆగ్రహమును కలుగజేసినది. కారణము: తటస్థరాజ్యములు యే రాజ్యమునకైనను ఆయుధములను విక్రయించవచ్చును. కాని అమెరికాయొక్క యీ పద్ధతి అట్లుకాదు. ఎరువు ఇచ్చుటవలన-ప్రత్యక్షముగ సైన్యముతో గాకపోయినను, ఆయుధముల రూపముననైనను బ్రిటనువైపు చేరుచున్నట్లు కన్పించుచున్నది—అదియునుగాక, ఆక్సిసు రాజ్యముల నౌకలను, ఆక్రమిత రాజ్యముల నౌకలను స్వాధీనపరచుకొని బ్రిటనుకు ఇచ్చుటవలన, బ్రిటనుతో అమెరికాచేరినట్లుగనే భావించి ఆక్సిసురాజ్యములు ప్రతిక్రియచేయుటకు ప్రయత్నించును.

ఇది ఇట్లుండ అమెరికా బ్రిటను తరఫున కాకపోయినను, ఆత్మరక్షణ నిమిత్తమైనను యుద్ధములో దిగక తప్పదు. బ్రిటను ఓడిపోయిన ఆక్సిసు రాజ్యముల పలుకుబడి హెచ్చిపోవును. అప్పుడు ఆక్సిసు రాజ్యములు దక్షిణ అమెరికాపై బయలుదేరును. హిట్లరుయొక్క నూతన రాజ్యవ్యవస్థ ప్రకారము జర్మన్ రిక్, మార్కులతోను, బార్టరు పద్ధతితోను వాణిజ్య వ్యాపారము జరుగును. అప్పుడు అమెరికా ఇంతకాలము నుండియు వాణిజ్యములో ఆక్రమించుకొనిన ప్రధానస్థానము పోవుటయే గాక, తాను ఇంతకాలమునుండియును కూడబెట్టిన బంగారుయొక్క విలువగూడ యుండదు. అందుకొరకై యూరప్ ఖండములో పెద్దరాజ్యమైన ఇంగ్లండుయొక్క రక్షణమే అమెరికాయొక్క బలము. ఇది తారుమారు కాకుండుటకై అమెరికా యుద్ధములో దిగవలసివచ్చును.

## ★ హిట్లరు విషమస్థితి

కాని అమెరికా యుద్ధమున ప్రవేశింపకమునుపే యుద్ధమును పూర్తిచేయవలెనని ఆశించిన హిట్లరు అమెరికాయొక్క వైఖరినిగూర్చి విషమపరిస్థితిలో దగుల్కొన్నాడు. ఇటు మధ్యధరాసముద్రమును ఇటలీకి వదలి, బ్రిటనుపై దాడులు సల్పుచు, యూరపుఖండములో తన పలుకుబడిని వృద్ధిచేసికొనదలచినాడు. కాని ఇటలీయొక్క పరాజయములు హిట్లరు ఆశలను కృంగదీసినవి. ఇటలీని పరాజయ పరంపరనుండి తప్పించుటకుగాను హిట్లరు జర్మను సైన్యములను ఇటలీకి సహాయార్థము పంపెనని వార్తలు దెల్పుచున్నవి. కాని యీ సైన్యములు అల్బేనియా రంగమునుగాని, లిబియా రంగమునుగాని ఇంకను చేరినట్లు గాన్పింపదు. ఒకవేళ చేరినను పరిస్థితులను అనుకూలమొనర్చుకొనుటకు చాలకాలము పట్టును.

జర్మను సైన్యము లిట్లు ఇటలీ సహాయార్థ మేగియున్న బ్రిటనుపై జర్మనుదాడి కొంతవరకు నిలుపబడినదని చెప్పవచ్చును. కాని బ్రిటను యీ వార్తలను విశ్వసించుటలేదు. అందులకే మొన్న చర్చిల్ ప్రధాని దాడి భయము తీరెనని అప్రమత్తతో నుండరాదని హెచ్చరించియున్నాడు. ఇప్పుడు హిట్లరు వైఖరి ఎట్లు మారునో దురవగాహముగ నున్నది.

## ★ జపాన్ బెదరింపు

యిరోపా రాజకీయములలో కాన్పించుచున్న సందిగ్ధస్థితియే ఇటు దూరప్రాచ్యములోకూడ కన్పించుచున్నది. జపాను విదేశాంగమంత్రి మట్సు-ఓ-కా అమెరికా జర్మనీతో యుద్ధమునకు తలపడినయడల జపాను జర్మనీ తరఫున దిగవలసివచ్చునని బహిరంగముగా తెల్పియున్నాడు. సోవియట్ రష్యాతో జపాను వ్యవహారములు చక్కబడలేదు. అట్టి తరుణములో, ఇంతకాలమునుండియు సహాయముచేయుచు, చంగ్-కై-షేక్ ప్రభుత్వమును జపానుకు వదిలివేసి, అమెరికా, రష్యా, ఇంగ్లండులు ఊరకొనవలసిన అవసరము లేదు. అమెరికా గాని, ఇంగ్లండుగాని జపాను బెదరింపులకు లొంగి చైనాను వదిలివేయుటను మాట కలలోని వార్త.

(28-12-40)




## నైజాములో బాల్యవివాహ శాసనము

నైజాము సంస్థానమందు అతి బాల్య వివాహముల నిరోధించుటకై సంస్థాన శాసనసభయందు కొనితేబడిన బిల్లు త్రోసివేయబడినది—

బ్రిటిషు భారతదేశమందు అమలులోనున్న శారదాచట్టమువలెనే—అట్టి పద్ధతుల మీదనే—యీ బిల్లు మొట్టమొదట ప్రవేశపెట్టబడినది. కాని ప్రజాభిప్రాయమునకై యీ బిల్లును ప్రకటించి, తదనంతరము, చర్చకు లోనైన తర్వాత, ప్రజాభిప్రాయము యిందుకు వ్యతిరేకముగ నున్నట్లు ప్రకటింపబడినది.

బిల్లును ప్రతిపాదించిన శ్రీ నరసింగరావుగారు, బాలికల వయస్సు 11గను బాలుర వయస్సు 16గను నిర్ణయించుట కంగీకరించినను ప్రయోజనము లేకపోయినది. హిందూసంఘము నుండియే అత్యధికమగు అసమ్మతి వచ్చినటుల ప్రకటింప బడినది. ఇది మొదటినుండియు తలచబడినదైనను శాసనసభలో అత్యధిక సంఖ్యాకుల సానుభూతిని పొందగలదని యాశించితిమి. కాని శెలక్టు కమిటీలోని ముగ్గురు మహమ్మదీయ సభ్యులు యిందుకు వ్యతిరేకముగ నుండుటవలన బిల్లు ఆదరణ నొందజాలక పోయినది.

మత సంబంధమైన వ్యవహారములయందు ప్రజానుమతికి వ్యతిరేకముగ ప్రభుత్వము వ్యవహరింప జాలదు. ఇది సర్వజన సమ్మతమగు విషయమే. ఐనను యీ బిల్లు విషయమున—ఇది కేవలము హిందూసంఘము లోని ప్రబల దురాచారమును మాన్పుటకు హిందువుల కొక్కరికొరకే నిర్దేశింపబడినప్పుడు—మహమ్మదీయ సభ్యులు సుముఖులుగ లేకపోవుట ఆశ్చర్యకరముగ నున్నది.

శారదాచట్టమువలె వివాహితులగు బాలబాలికల వయస్సు ఎక్కువగగాక 16, 11 సంవత్సరములు తక్కువగ నంగీకరించియున్నప్పటికిని యీ చట్టము శాసనసభామోదమును పొందజాలక పోయినది. ఇంతటి వ్యతిరేకాభిప్రాయము హిందూ సంఘమునందున్నప్పుడు ఈ బిల్లు ప్రభుత్వముచే నామోదింపబడినను ప్రయో. జనకారి కాజాలదు.

నిర్బంధ చట్ట ప్రయోగమువలన నైతిక పరివర్తనము కలుగదు. నైజ భక్తి ప్రేమలులేని సంస్కరణ సఫలత నొందనేరదు—

ఇందుకొరకై శ్రీ నరసింగరావు ప్రభృతులు తీవ్ర ప్రచారము మండలముయందు జరుపవలసియున్నది. ప్రజలు యీ యాచారమువలన కలుగుచున్న యనర్థములను తెలిసికొని వారిలో పరివర్తన ముదయించునట్లు జేసిన యీ శాసనము మరియొక పర్యాయమైనను ఆమోదింపబడగలదు.

సాంఘిక సంస్కరణలలో ప్రప్రథమమగు నిది భారతదేశమంతటను, ప్రతి సంస్థానమునందును అంగీక రింపబడుచున్నది. ఇదియేగాక, బ్రిటిషు భారతదేశముకంటె ఎన్నియో సంస్కరణలు స్వదేశ సంస్థానముల

యందు జరుగుచున్నవి. ఇట్టి విషయములయందు వెనుకబడియున్నదనెడి కొచ్చిన్ సంస్థానమునందు యీ బాల్యవివాహ నిషేధ శాసనము ఇటీవలనే అంగీకరింపబడిన దన, భారతదేశము సంస్కరణోద్యమమునకు ఎంత సుముఖమైయున్నదో వేరుగ జెప్ప నవసరములేదు.

అట్టి పరిస్థితులయందు, స్వదేశ సంస్థానములలోకెల్ల పెద్దదియైన నైజాము సంస్థానము యీ విషయమందు చిన్నది కాగలుగుట హర్షింపదగిన విషయముగాదు.

ఈ విషయముపై ఇకనైనను ప్రజలును, ప్రభుత్వమును తీవ్ర ప్రయత్నము లొనర్తురుగాక యని యాసించెదము.

♦ ♦ ♦ ♦

## మహాత్ముని ధర్మయుద్ధము

క్రిస్టమస్ పర్వదినములలో సత్యాగ్రహసమరమును నిలుపవలసినదిగా వివిధకాంగ్రెసు సంఘములకు మహాత్ముని యాదేశమైనది.

శాంతియుతముగా సాగిపోవుచున్న యీ సత్యాగ్రహమును అవుచేయుటయందలి పవిత్రాశయ మొకసారి ప్రపంచమునకు వెల్లడియైనది.

ఇది సత్యసమరము. దీనికి ప్రేమ ప్రధానము. శాంతి ఆశయము. అహింస ఆయుధము. విశ్వమానవ సౌభ్రాతృత్వమే దీని లక్ష్యము. దౌర్జన్యరహిత సూత్రము నాధారము చేసికొనిన దగుటచే దీనికి త్యాగమవసరమైయున్నది.

ఏసు ప్రవక్త జీవితాశయములుకూడ నివియే—ఈ ఆశయముల పరిపూర్తికొరకే ఆయన ఆత్మార్పణ చేసియున్నాడు. మహాత్ముడు జన్మచే హైందవుడయ్యును, సర్వమతములయందలి సారమును సంగ్రహించిన సర్వజ్ఞుడు. ఆయన మతములకును, మానవులకును అతీతుడు. అజాతశత్రుడు, అహింసానిరతుడు. విశ్వమానవ సౌభ్రాతృత్వమును స్థాపించు ఆతని శాంతి సమరములో, విశ్వమానవ సౌభ్రాతృత్వముకొరకై యాత్మబలిదాన మొనగిన క్రైస్తుదేవుని సంస్మరణముకొరకై యీ పర్వదినములలో సమరము నాపుట పవిత్ర ధర్మమైయున్నది.

బ్రిటనుపై తన కేమాత్రము ద్వేషభావములేదనియు, ప్రస్తుత యుద్ధదావానలమున దగుల్కొని స్వాతంత్ర జపముచేయుచున్న ఇంగ్లండుకు ఎట్టి చిక్కును గల్పించుట తన యభిమతముగాదనియు మహాత్ముడు ఎన్నియో సారులు తెల్పియున్నాడు.

ఈ పవిత్రభావమును సర్వ ప్రపంచమున చాటుటకే మహాత్ముడీ నిర్ణయమును చేసియున్నాడు. ప్రాచ్య, పాశ్చాత్యదేశములు, అందును క్రైస్తవ ప్రపంచము మహాత్ముని యీ ధర్మసూత్రమును యీ సరికి గ్రహించి యుండును.

క్రైస్తవ ధర్మరక్షణకొరకై యుద్ధ మొనర్చుచున్న బ్రిటిషురాజ్యాంగవేత్తలు ధర్మయుద్ధగామియైన భారతదేశముయెడల తమ దృష్టి యిప్పటికైన మార్చుకొందురా?

Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao,
at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.